# క్షేత్రయ్య పదములు - అభినయము



భరతకళా ప్రపూర్ణ

**న ట రా జ  రా మ కృ ష్ణ**

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సహాయమున ముద్రితము

నర్తనమురళి-30
ప్రచురణ-
అక్టోబరు_1974
వెల : ఆరురూపాయలు



ముఖచిత్రం : రామప్పదేవాలయ శిల్పం
రూపకల్పన : శ్రీ వి. శ్రీనివాసశర్మ

ముద్రణ :
నాట్యకళ ప్రెస్
హైదరాబాదు,
500004.

ప్రతులకు :
నృత్యనికేతనం
చిక్కడపల్లి, హైదరాబాదు-500020

# అంకితం



కళాభిమానులు, సహృదయులు

ఆంధ్రప్రదేశ్ విద్యా, సాంస్కృతికశాఖా మంత్రివర్యులు

శ్రీ మండలి వేంకటకృష్ణారావుగారికి.

# మాట

భరత విద్యకు మకుటము అభినయము. అభినయానికి జీవము క్షేత్రయ్య పదములు. పదములు అభినయించు పద్ధతి విపులంగా వ్రాయాలనే ఆశయంతో పెక్కు సంవత్సరాలు శ్రమించాను. పరిశోధన చేశాను. అభినయ శాస్త్రవేత్తలను సందర్శించాను. నూరుపదాలకు మూడువేల పేజీల వ్యాఖ్యానం రచన చేశాను. అందలి కొన్నిపదాల వ్యాఖ్యానం ప్రభుత్వంవారు అందజేసిన ఆర్థికసహాయంతో ఈచిన్ని గ్రంథరూపంలో అచ్చువేసి కళాలోకానికి అందిస్తున్నాను. పూర్తి గ్రంథం వెలుగుజూచే అవకాశం కల్పించాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

ఈ వ్యాఖ్యాన రచనకు నన్ను అన్ని విధాలా ప్రోత్సహించి, సవరించి, తీర్చి దిద్ది గ్రంథం అచ్చుకాకముందే స్వర్గస్థులైన పూజ్యులు శ్రీ విస్సా అప్పారావుగారి ఆత్మశాంతికి, కళా సరస్వతిని ప్రార్థిస్తున్నాను.

అభినయ కళాకారులు ఈ రచనను సహృదయతతో స్వీకరిస్తారని ఆశిస్తున్నాను.

నటరాజ రామకృష్ణ

# క్షేత్రయ్య కానుక

క్షేత్రయ్య ఆంధ్రుడు, కృష్ణభక్తుడు, మధుర భక్త్యుపాసకుడు, కవి, గాయకుడు, సంగీత శాస్త్రజ్ఞుడు, నర్తకుడు, అభినయ కళా వేత్త, పండితుడు, విద్వాంసుడు, భారతీయ అభినయ కళను నూతన వెలుగులతో తీర్చిదిద్దిన సకల కళాపూర్ణుడు, ఏకైక పదరచయిత. అట్టివాడు అతనికి ముందు పుట్టలేదు. ఇక ముందు పుట్టబోడు.

మువ్వపురివాసి. మువ్వలోని గోపాలమూర్తి, అతని అభిమాన దైవము. తాను రాధయై ఆ జగన్నాధుడు మువ్వగోపాలుని నాయకునిగా నెంచి రచించిన, రసనిలయములైన మువ్వగోపాల పదములే భారతీయ అభినయ కళను అత్యుత్తమ స్థాయికి గొనిపోయినవి. ఆ మువ్వ, భాగవత మేళములకు ప్రసిద్ధిగాంచిన కూచిపూడికి చేరువ నున్నది. కూచిపూడి దివి తాలూకాలోనిది. ఈ ప్రాంతం శాతవాహనుల కాలం నుండి ఆంధ్రుల సాంస్కృతిక వికాసానికి పేరుగాంచినది. శ్రీకాకుళం ఆంధ్ర విష్ణువు ఆలయం, మువ్వకు చేరువనే వున్నది. ప్రసిద్ధ బౌద్ధక్షేత్రము, ఘంటసాల మువ్వకు సమీపమునందే వున్నది. ఆంధ్ర విష్ణు ఆలయంలో ప్రాచీన కాలం నుండీ దేవదాసీలు నర్తనపూజ సల్పేవారు. ప్రాతఃకాలమునుండి, నడిరేయి వరకూ స్వామికి జరిగే షోడశోపచారముల్లో నర్తకీమణులు నృత్యగాన సేవ చేసెడివారు. తెలుగురాజు కృష్ణదేవరాయల ఆముక్తమాల్యదలో ప్రాచీన కాలము నాటి నృత్య సంగీత విధానాల గూర్చి తెలిసికో వచ్చును. ఘంటసాల ప్రసిద్ధ బౌద్ధక్షేత్రమే గాక, మతమునకు,

లలిత కళలకు గూడ నిలయమై విలసిల్లినది. వేదవిద్యా పారంగతు లైన బ్రాహ్మణ పండితులు కూచిపూడిలో నివసించి భాగవత కళను చేపట్టినారు. ఆరాధించి, సంస్కరించి, ప్రచారములోనికి దెచ్చినారు. అంతటి సాంస్కృతిక వికాసముచెందిన సీమలో బుట్టినాడు క్షేత్రయ్య. సంగీత నాట్యముల చక్కగా నభ్యసించినాడు. అభినయించినాడు. నర్తనమాడినాడు. అంతటితో తృప్తిచెందలేదు. ఆ కాలంలో ప్రచారంలోనున్న నృత్య సంగీతాల, ప్రదర్శనతో సంతృప్తిచెందక తానొక నూతన కళా సృష్టి చేయనెంచినాడు. అదెట్టిదై యుండవలె యక్షగానములా? తన కాలము నాటికే కూచిపూడివారు, ఓరుగంటి దేవర నర్తకులు, శివలీలలు, విష్ణుకథలు, యక్షగానముల నాడు చున్నారు. పారిజాత కథ, దశవిధ శివలీలలు, రామకథలు విరివిగా మార్గదేశి సంప్రదాయ విద్యలుగా ప్రచార మందుండినవి. ఇవి యక్షగాన పద్ధతిలో, వీధి నాటక పద్ధతిలో ఆడబడుచుండినవి. అందు అనేకములైన దేశి, మార్గపద్ధతి, సంగీతరీతులు ప్రయోగింపబడి ప్రచారములోనికి వచ్చినవి. వృత్తములు, దరువులు, త్రిపుటలు, కంద, సీస, ద్విపదలు; అర్థములు, అర్థచంద్రికలు, ఏలలు, జోలలు, ధవళములు, సువ్వాళులు, కందుక క్రీడలు యిత్యాదులన్నీ, అందు ప్రయోగింపబడినవి. సంస్కృత, తెనుగు ఛందో రీతులన్నీ వానియందు ఉపయోగించబడినవి. ఈ విధంగా పరిపుష్టమైన నాట్యరీతి యక్షగానములో ప్రదర్శితమైనది.

యతి నాట్యములు, శుద్ధ నాట్యము, పేరిణి, దేశి, కౌతములు యిత్యాదులందు నృత్తము వికసించినది.

భారతదేశ సంగీత లోకానికి కాలవాహినిలో కలియక నిలిచిన అతి ప్రాచీన సంగీత రచన జయదేవుని అష్టపదుల ద్వారా, నృత్యము సంపూర్ణముగా పోషింపబడినది.

నట్టువమేళ (దేవదాసీ రీతి), నాట్యమేళ(భాగవత రీతి) సంప్రదాయముల అభివృద్ధి వల్ల లాస్య తాండవ పద్ధతులు రెండూ వున్నత స్థాయి నందుకున్నవి.

ఇక మిగిలినది, అభినయము, ఆంగిక, వాచిక, ఆహార్య, సాత్వికములతో గూడిన అభినయకళతో, ఆంగికము, వర్ణనాత్మక గీతముల, అర్థమును ప్రకటించుటలో ప్రయోగింపబడినది. అట్టి రచనలు ఆ కాలము నాటికే యెన్నో వెలువడినవి. కాని సాత్విక ప్రాధాన్యమైన అభినయానికి అనుకూలించే రచనలు కొరతబడినవి. భారతీయ నృత్య సాహిత్యంలో, సంస్కృత మందుగాని, మరియే ఇతర భాషలందు గాని అట్టి రచనలు లేవు. ప్రపంచంలో ఉత్తమ నృత్య కళారీతిగా భారతీయ నర్తనముల పొగడబడుటకు కారణం, సాత్వికాభినయమే. అట్టిది ప్రపంచంలో మరెచ్చటా లేదు. ఆ కళను మేలు పద్ధతిలో అభినయించుటకు తగిన రచనలు లేవు. అన్నమయ్య, పురందరదాసు పద రచనలు చేసిననూ అవి పాటకు ఉపయోగపడి నంతగా, ఆటకు ఉపకరించలేదు.

పాట సులభశైలిలో నడవాలి. పదాడంబర ముండకూడదు. అందరకూ అర్థమయ్యే మాటల్లో వుండాలి. భాష భావగర్భితమై యుండవలె. మాటలు తక్కువగా వుండాలి. రాగములో మిళితమై పోయేరీతిని అక్షరముల కూర్పు వుండవలె. విలంబిత లయలో స్థాయి భావాన్ని సంచారము చేయుటకు అనుకూలించే రీతి ఆ పదముల కూర్పువుండవలె. ధ్వనిప్రాధాన్యత కల్గివుండవలె ఇన్నింటిని ఒప్పించ గల్గిన రచనయే సాత్విక భావ ప్రకటనకు ఉపకరించును. అట్టి వాని యొక్క అభినయమే పండిత జనరంజకం, పామర జన ప్రబోధకముగా నుండి, రసభావముల జిప్పిలజేయును ఇన్నీ కూడిన రచన చేయు గల్గువాడు, తాను స్వయముగా గాయకుడు, నర్తకుడై యుండి

కావ్య రచన చేయుగల్గువాడై యుండవలె. అట్టి మహనీయుడే క్షేత్రయ్య.

సత్యభామ ప్రణయ కలహము, విరహ వియోగములను కలాపముగా నల్లి, కూచిపూడి భాగవత సంప్రదాయము నేర్పరచి, శాశ్వత కీర్తి నార్జించినాడు సిద్ధయ్య.

తన పద కవితతో ఒక నూతన అభినయ కళాసృష్టిచేసి, దేవదాసీల అభినయకళపై ఒక నూతన వెలుగును ప్రసరించి అమర మూర్తియైనాడు క్షేత్రయ్య.

ఇరువురూ తెలుగువారే. ఇరువురూ కృష్ణ భక్తులే. సిద్ధేంద్రుడు కూచిపూడికే పరిమితమైనాడు. క్షేత్రజ్ఞుడు దక్షిణ భారతమంతా వ్యాపించాడు. అతని కవిత చదివినా, పదవులు గానం చేసినా, వినినా, అభినయించినా చూచినా ఎట్టి రసానుభూతి కల్గుననగా-

అలంకార శాస్త్రాల్లో మరుగుపడిపోయిన నాయికానాయకులు లోకంలో తమ శాశ్వత ప్రచారము కొరకు-సంపూర్ణ అవతారమూర్తి శ్రీకృష్ణదేవుని యొద్దకుబోయి, స్వామి మేము ప్రపంచంలో విశేషంగా ప్రచారం పొందవలెననీ, నృత్య గీతాలు రూపొందించి మధురంగా పాడుతూ, అందమైన యువతులు అభినయించిననాడే మేము నిలువగల్గుతాము, కనుక మాకొక రూపకల్పన చేయుమని ప్రార్థించగా, ఆ గోపాలమూర్తి వారిపై కరుణించి, భరతవర్షములో జన్మించి, కవితనల్ల దలంచి, భారతీయ భాషల్లో, దేశంలో అభినయ కళకు జీవం పోయగల ప్రాంతంగా ఆంధ్రదేశము నెంచి అనువైన భాష తెనుగుగా తలంచి, తెనుగు గడ్డలో క్షేత్రయ్యగా జన్మించి, పదకవితనల్లి, ప్రతిపదములో ఒక్కొక్క నాయికను రూపొందించ

దలచి తానే ఆడిపాడి అభినయించి, ప్రచారము చేసి, అమరకీర్తిని బడిసె ననిపించును అంతటి మహత్తు గల్గినట్టిది క్షేత్రయార్యుని కవిత.

ఆ కాలమూ అట్టిదే, మహమ్మదీయులైన గోల్కొండ పాదుషాలు తాము సంస్కృతము నందు అలంకార శాస్త్రాల రచన చేసినారు. హిందూవీరుల పోషించినారు. కళల అభివృద్ధికి సహకరించినారు, ప్రోత్సహించినారు. క్షేత్రయ్య పదములు చెప్పి పాదుషాల మెప్పించి తంజనగరం వెళ్ళినాడు నాయకరాజులు పాలిస్తున్నారు. తంజనగరం—వారి దర్బారు సరస్వతీ నిలయము, సంగీత నాట్యాల సారమెరగి, అభినయించగల నర్తకీమణు లెందరో ఆ ఆస్థానంలో నుండినారు. క్షేత్రయ్య పదముల రచన చేయగా, వాటిని పాడి అభినయించినారు. ఆనాటి నర్తకీమణులు అతని కవితను వేనోళ్ల గొనియాడినారు. ఆవాతావరణము, ఆ కళాకారుల సరస్వతీ సేవ అతనికి యెంతో ప్రోత్సాహాన్ని కల్గించినది. అతడు విరివిగా రచనలు సాగించగల్గినాడు.

క్షేత్రయ్య అనేక పుణ్యక్షేత్రాల సందర్శించి అక్కడ మూర్తులపై పదకవిత జెప్పినాడు కాని, ఏ మూర్తిలో జూచినా మువ్వగోపాలునే గాంచినాడు. అంతటి గాఢ మతని మక్కువ, మువ్వపురి గోపాలునిపై.

పదముల అభినయ మొక ప్రత్యేక కళ. పూర్వము ఆంధ్రలో పదాభినయమందు ప్రత్యేకముగా కృషిసల్పిన నట్టువరాండ్రుండెడివారు. వారు అభినయమును మాత్రము ప్రదర్శించెడివారు.

నేను పూజ్య గురువుగారు శ్రీమతి కాళహస్తి రాజమ్మవద్ద నూరు పదముల వరకు అభ్యసించాను. పూజ్యశ్రీ విస్సాఅప్పారావు

గారితో పరిచయ భాగ్యం కలిగిన తరువాత పదాభినయంలో విశేష కృషిసల్పే అవకాశము లభించింది. నృత్యముపై నేను 30 గ్రంథ ములు వ్రాసినాను. అందు 6 గ్రంథాలకు ప్రభుత్వ బహుమతి వచ్చి నది. కాని అవన్నీ ఒక యెత్తు, ఈ గ్రంథమొక యెత్తు. ఇట్టి రచన బహుపరిశ్రమకు, శ్రమదీర్పు కొడినట్టిది. ఇటువంటి వ్యాఖ్యానాలను వ్రాయువాడు తాను స్వయంగా పాడి అభినయించగల శక్తి సంపన్నుడై వుండవలె. ప్రతి సంగతి, భావాన్ని ముందుగా తానభి నయించి చూచుకొని, ఏయే భావమెంతవరకు ఆ నాయిక పోషణకు ఒప్పునో గుర్తెరిగి రచన సాగించవలె. ఇది చెప్పినంత సులభంగాదు. కాని అట్టి రచనయే దేశసౌభాగ్యానికి ఉపయోగపడునట్టిది. అటువంటి స్థాయికి చెందే రచనగా రూపొందించాలని కృషి సల్పినాను. రచన సాగించినాను. నా కృషి ఫలించినదని ఆశిస్తున్నాను. నాచే ఈ కళా సేవ చేయించుకున్న కళా సరస్వతికి అంజలి ఘటిస్తున్నాను. రసిక లోకం నా కృషికి మెచ్చి ఆనందిస్తారని ఆశిస్తున్నాను.

# అభినయము - శాస్త్రచర్చ

రసాలంబకులగు స్త్రీ, పురుషులు నాయికా నాయకులన బడుదురు.

స్వీయ, పరకీయ, సామాన్య యని నాయిక మూడు విధములు.

స్వీయ :—తన స్వామియందే అనురాగము గల పతివ్రత.

స్వీయలో మూడు విధములు: ముగ్ధ,మధ్య, ప్రగల్భ.
ముగ్ధలో నాలుగు విధములు :

(1) అజ్ఞాత యౌవన: యౌవన ప్రారంభమును తెలిసికొన లేనట్టిది.

(2) జ్ఞాత యౌవన. యౌవన ప్రారంభమును తెలిసికొనగలిగినది.

(3) నవోఢ : క్రొత్తగా వివాహమగుటచేత సిగ్గు, భయము గలది.

(4) విస్రబ్ధనవోఢ : బెదురుతీరి వినయముతో వ్యవహరించునది.

"మధ్య" ఆరు విధములు.

[1] మధ్యధీర [2] మధ్యాధీర [3] మధ్యధీరాధీర [4] మధ్య ధీరా జ్యేష్ఠ కనిష్ఠ [5] మధ్యాధీరా జ్యేష్ఠ కనిష్ఠ [6] మధ్యధీరాధీర జ్యేష్ఠ కనిష్ఠ.

ప్రగల్భ ఎనిమిది విధములు :

[1] ధీర [2] అధీర [3] ధీరాధీర [4] ధీరా జ్యేష్ఠ కనిష్ఠ [5] అధీరా జ్యేష్ఠ కనిష్ఠ [6] ధీరాధీరా జ్యేష్ఠ కనిష్ఠ [7] రతి ప్రియ [8] సురతానంద మోహిత.

వివరములు

[1] ముగ్ధ : అంకురిత యౌవన

[2] మధ్య : లజ్జ, మన్మదోత్సాహము సమానముగా గలది.

[3] ప్రగల్భ : సకల కేళీకలాపకోవిద. లజ్జను జయించినది. కామేచ్ఛ కలది. ప్రౌఢ.

మధ్య

[1] ధీర : అన్య స్త్రీ సంభోగముగల పతిని వ్యంగ్యముగా కోపవచనములు పలుకునది.

[2] అధీర : అన్య స్త్రీ సంభోగియైన పతిని పరుషవాక్యము లాడునది.

[3] ధీరాధీర : అన్య స్త్రీ సంభోగియైన పతిని ఎత్తిపొడుపు మాటలచేత, దుఃఖముచేత కోపమును ప్రకాశింపజేయునది.

[4] జ్యేష్ఠ కనిష్ఠ : నాయకుడు ఇద్దరు భార్యలను కల్గి యున్నప్పుడు ఒక నాయికకంటె మరియొక నాయికయందు అధిక

ప్రేమ కనబరచుటవలన ఈ భేదము లేర్పడును. అది ఎరిగి కోపము ప్రకాశింపజేయునప్పుడు ధీరాధీరాది లక్షణములు కలిగియుందురు.

ప్రగల్భ (ప్రౌఢ)

ధీర అన్యస్త్రీ సంభోగము చేసి వచ్చిన పతియందు రత్యుదాసీన భావముగల నాయిక. ధైర్యము ప్రధానము. వ్యంగ్యవచనము లాడునది.

అధీర : అన్యస్త్రీతో కూడివచ్చిన పతిని వ్యంగ్యరహితముగా పరుష వాక్యము లాడునది. అధైర్య ప్రధానము.

ధీరాధీర : పరస్త్రీతో రతికేళి సల్పివచ్చిన పతియందు రత్యుదాసీనభావము కలిగి వ్యంగ్యముగాను, స్పష్టముగాను కోపమును జూపునది. ధైర్య అధైర్య మిశ్రితము.

జ్యేష్ఠ కనిష్ఠ మొదలైన భేదములు ప్రగల్భకు కూడా గలవు.

**పరకీయ**

పరకీయ : పర పురుషుని యందుగల అనురాగమును వ్యక్తము గాకుండ నుండునట్టిది.

పరకీయలో కన్య, పరోఢ అని రెండు విధములు.

కన్య : అవివాహితయై తల్లిదండ్రుల అధీనములో నుండి జార వ్యాపారము చేయునది.

పరోఢ : వివాహితయై కూడా జార వ్యాపారము కలది.

ఈ నాయికలో కొన్ని ముఖ్య భేదములు :

[1] గుప్త [2] విదగ్ధ [3] లక్షిత [4] కులట [5] అనుశయాన [6] ముదిత—I. సాహసికి II ప్రతిభాచతుర III అపలాప చతుర.

(1) గుప్త : జార సురతమును గోప్యము చేయునది. గుప్త మూడు విధములు.

వృత్త సురత గోపన : అనగా జరిగిన జార సురతమును మర్మపరచునది.

వర్తిష్యమాణ సురతగోపన : జరుగబోవు జార సురతమును గోపనము చేయునది.

వృత్త వర్తిష్యమాణ సురతగోపన : జరిగిన జార సురతమును, జరుగబోవునట్టి దానిని మర్మపరచునది.

(2) విదగ్ధ : తన మనోభిప్రాయము నితరులకు తెలుపకుండ జారునికి మాత్రము తెలుపునది.

ఈమె వాగ్విదగ్ధ, క్రియావిదగ్ధ అని రెండు విధములు.

వాగ్విదగ్ధ : వాక్చాతుర్యముతో తెలియబరచునది.

క్రియావిదగ్ధ : క్రియలచేత తెలుపునది.

అంగ ప్రత్యంగోపాంగములయొక్క సంజ్ఞలచేత తన కోరిక తెలియబరచునది.

(3) లక్షిత : తన చర్యలు ఇతరులు కనిపెట్టుచున్నారని తెలిసికొనునది.

(4) కులట : బహు పురుషులతో సురతము కోరునది.

(5) అనుశయాన : సంకేతస్థాన సందర్భమును చింతించునది. I వర్తమాన సంకేత స్థల సందర్భమునుగూర్చి చింతించునది. II సంకేతమందు కార్యము లభింపకుండుటచేత చింతించునది. III తాను నిశ్చయించిన సంకేత స్థలమునకు ప్రియుడు రాకుండుటచేత ఇతర స్థల

మునకు వెళ్లినట్లు తెలిసి అనుతాపము పొందునది - అని అనుశయాన మూడు విధములు.

(6) ముదిత : తనకు సమయము దొరికినదని ప్రియునికి తెలుపుటకు ఉత్సాహపడునది.

(7) సాహసిక : పతి సమీపమందున్నను అతనిని వంచించి ప్రియుని గూడునది భర్త, అత్తమామలు లేని సమయమును గూర్చి సాహసించి చెప్పునది.

"ఇది మంచి సమయమోయి గోపాల!

ఇకనైన లేచి రావోయి

మదన జనక నాడు

మామ యింటను లేడు

వదిన గారిపుడేనన్

వదలి అవతలకేగె"

(8) ప్రతిభాచతుర : తన వ్యభిచారము కొంత బయలుపడినను వాక్చాతుర్యముచే బొంకునది.

(9) అపలాపచతుర : తను అమాయకురాలినని రోదనము చేసి పతిని వంచించి తనయందు పతికి కనికరము పుట్టించునది.

**సామాన్య భేదములు**

ద్రవ్యముకొరకు సకల పురుషులయందు అనురాగము ప్రదర్శించునది సామాన్య.

జాతి సామాన్య : అవివాహితయై తన కులవృత్తిని అనుసరించునట్టి స్త్రీ.

ఆగంతుక : వివాహమైన తరువాత పతిని విడిచి విచ్చలవిడిగా ద్రవ్యముకొరకు వ్యభిచరించునది.

గూఢ సామాన్య : వివాహితయైగాని, కాకగాని పతిని విడిచి ఇంటివారియొక్క అనుమతిపై సంచరించి ద్రవ్యము సంపాదించునది.

గూఢ సామాన్యను పండితులు ఒప్పుకొనకపోయిననూ ఇట్టి వారుగూడా సంఘములో నున్నారు కనుకనే పేర్కొనబడినది.

అష్టవిధ నాయకులు

లక్షణములు—లక్ష్యములు

[1] ప్రోషిత భర్తృక [2] ఖండిత [3] కలహాంతరిత [4] విప్రలబ్ధ [5] విరహోత్కంఠిత [6] వాసకసజ్జిక [7] స్వాధీనపతిక [8] అభిసారిక.

[1] ప్రోషిత భర్తృక : పతి దేశాంతరముపోయి యుండగా వియోగముచే చింతించునది.

ఈ నాయికయొక్క దశావస్థలు :

[1] దృక్సంగము
[2] మనస్సంగము
[3] సంకల్పము
[4] జాగరము
[5] కృశత
[6] అరుచి
[7] హ్రీత్యాగము
[8] ఉన్మాదము
[9] మూర్ఛ
[10] మరణము.

ఈ నాయికయందు మరణము తప్ప మిగిలిన అవస్థలు అభినయించవలెను.

ప్రోషిత భర్తృక-క్షేత్రయ్య పదము

ప. ఏమని తెలుపుదు—నేల్లాగు తాళుదు
నేమి చేతునే చెలియా!

అ. భామరో! య్యారిక్కి బయ్యల్లుదేరెడు వేళ
ప్రేమమీర నాసామి పిలిచి చెప్పినమాట
॥ఏమని॥

1. "అన్నమిందక—అతివెత నొందకు
కన్నీరు నింపకు-కలవరింపకు"మని
ఎన్నెన్నో విధముల-హితవులు తెలుపుచు
కన్నీరు నించుచు-కాంతుడు చెప్పిన మాట
॥ఏమని॥

— — — — —

2. ఖండిత : ప్రియునియందన్యస్త్రీ సంగమ చిహ్నములను జూచి ఈర్ష్య పొందునది.

కోపించునది ఖండిత.

నాయకుడు చెంతనే యుండును.

ఇందులో భావఖండితయనుగలదు. అనగా పతి అన్యస్త్రీతో కూడెనని తెలిసి పతి యేతెంచిన పిదప దండించ నుద్యుక్తురాలై యుండునది.

ఇంటికి రానిచ్చేనా-ఈ మేనుతో
యింతివాని దలచేనా?
గొంటు కాదు వేణుగోపాలరాయుడు
తంటాలు జేసితె దండించక విడిచేనా?

ఈ నాయిక చేష్టలు-ఆరు.

(1) దృఢములేని మాటలునాడుట

(2) విచారము

(3) కాక నొందుట—అనగా కోపము చెందుట

(4) నిట్టూర్పు పుచ్చుట

(5) తెల తెలబోయి యూరకుండుట

(6) కన్నీరు నించుట

ఈ నాయిక వ్యాపారములు—ఆరు

1. నిట్టూర్పు

2. పలుక కుండుట

3. కన్నీరు నించుట

4. భ్రమించుట

5. ఖేదపడుట

6. మూలుగుట.

**(స్వీయ) ఖండిత నాయిక-క్షేత్రయ్య పదము**

ప. తగిలితివిక నిన్ను—తరలనీయనోయి

అ. వగకాడా మా మువ్వగోపాలా! నా సామి

॥తగిలితి॥

చ. గంధము చాటున—ఘనమైన జడవేటు

కందియున్న సొగసు—కనుగొంటినోయి

సందిటనున్న ఈ చందురు పిల్లలు

అందమాయనోయి—అందుకేమోయి

॥తగిలితి॥

*   *   *   *

కలహాంతరిత : పతినవమానించి తరువాత తాపబడునది. ఈ నాయికకు నాయకుడు చెంతనే యుండును. లేనియెడల రాయబార మంపును.

ఈ నాయిక చేష్టలు.

(1) తొందరపాటు

(2) విచారము

(3) నిట్టూర్పు

(4) మోహముచేత } తల్లడించుట
(5) దుఃఖముచేత

ఈ నాయిక వ్యాపారములు

నిర్వేదము

విషాదము

మదము

ఔత్సుక్యము

మోహము

మొదలైన సంచారులు ఈ నాయిక వ్యాపారములు.

(స్వీయ–ప్రౌఢ)

**కలహాంతరిత – క్షేత్రయ్య పదము**

ప. మేరకాదు రమ్మనవే! నా సామిని

అ. మోరతోపు సేయక—మువ్వగోపాలసామిని

॥ మేర॥

అలిగేవారలు లేరో! అంతలోనే సమ్మతించి

కలిసేవారలు లేరో?—కలికిరో! యిపుడు

చలపట్టి యిందు రాడు—చాల మ్రొక్కిన వినడు
వలరాజు బారికోర్వ—వశముగాదోయమ్మా

॥మేర॥

— — —

(4) విప్రలబ్ధ : సంకేత స్థలమున పతినిగానక వంచింపబడి వ్యాకులపడునది. ఈ నాయిక చేష్టలు-5.

(1) మిక్కిలి విచారము
(2) నిట్టూర్చుట
(3) సఖిజనుల దూషించుట
(4) కన్నీరు నించుట
(5) మూర్ఛిల్లుట

వ్యాపారములు :

(1) నిర్వేదము
(2) చింత
(3) ఖేదము
(4) దైన్యము
(5) అశ్రువులు
(6) నిట్టూర్పు
(7) మూర్ఛ

మొదలైన సంచారులీనాయిక వ్యాపారములు.

(స్వీయ—ప్రౌఢ)

**విప్రలబ్ధ- క్షేత్రయ్య పదము**

ప. ఈ మేను జీవునకు—నెంత ప్రియమాయెన్

అ. భామ! మా మువ్వగోపాలు కౌగిటలేని

॥ఈ మేను॥

1. పడతి నే నొకచోట—ప్రాణేశు డొకచోట
ఎడబాసి మరునిచే—యిడుములకు లోనై
కడలేని విరహాగ్ని—గ్రాగియున్నది చాల
పుడమిలో వేరే జ-న్మము లేదె సుమతి!

॥ఈ మేను॥

— — — —

(5) విరహోత్కంఠిత : ప్రియుడు రాడాయెనని విరహము చేత చింతించునది. నాయకునికి రాయబారమంపును.

ఈ నాయిక చేష్టలు—ఆరు

[1] దుఃఖము
[2] తాపము నొందుట
[3] ఆవులించుట
[4] శరీరము చిక్కుట
[5] శరీరము వణుకుట
[6] తన దుఃఖమును చెలులకు చెప్పుకొనుట

ఈ నాయిక వ్యాపారములు.

[1] సంతాపము
[2] దేహము వణుకుట
[3] చిన్నబోవుట
[4] పనులయందు ప్రీతిలేమి
[5] కన్నీరు విడుచుట

[6] తన యవస్థలను చెలులకు తెల్పుకొనుట మొదలైనవి కల్గును.

[స్వీయ—మధ్య]

**విరహోత్కంఠిత - క్షేత్రయ్యపదము**

ప. ఎందుకు పగజేసెనో? కమలజు—ఒకనైన
లెస్స వ్రాయడో
అ. అందుకందుకు చెలుల మరికితో నున్నారు
చందమామ—ఈ రేయి—చల్లనుండడే దైవమా
॥ఎందుకు॥

1. బలిమి నేమంటినో? నా సామిని తెలియక పొమ్మంటినో
కల కంటిరో! వినవే—కలలో వాని గంటి
చెలిమి చెలువుడేల—చేరదీయడు దైవమా?
॥ఎందుకు॥

[6] వాసకసజ్జిక : ఆ సమయమునకు ప్రియుడు రాగలడని సురత సామాగ్రిని సన్నాహము చేయునది. తానలంకరించుకొనునది, పడకయిల్లు శృంగారించి యెదురుచూచునట్టిది. నాయకునికి రాయబారమంపును.

ఈ నాయిక చేష్టలు

[1] కోరికలు

[2] చెలికత్తెలతో విలాసముగా గడుపుట

[3] ప్రియుడు వచ్చే దారిని చూచుట

[4] అనుభవింపదగిన పూలు, గంధము, మధుర పదార్థములు జాగ్రత్తచేయుట

[5] వచ్చే వారిని ప్రియుడెప్పుడు వచ్చునో చెప్పుమని అడుగుట, ఆత్రుత.

వ్యాపారములు

[1] నాయకునితోడి క్రియలనుగూర్చి యోచించుట

[2] సఖులతో వినోదము సల్పుట

[3] అడుగడుగునకు చెలికత్తెను సాభిప్రాయముగ జూచుట

[4] తన దగ్గరకు వచ్చేవారిని నాయకుడని భ్రమ జెందుట.

[స్వీయ—మధ్య]

వాసక సజ్జిక-శ్రీత్రయ్యపదము

ప. అవునమ్మ! మీ కేమి!—అందరు బోధించెదరు

అ. నవుగాదు వాని గుణము—నాటివలెనే లేదు

॥అవునమ్మ॥

[6] ఎదురుగా తలవాకిట నే-నెంత సేపైనాను
ఇదే వచ్చునోయనుచు - హితవుతో నేను
పదముల మీద కడుగ - పన్నీరు చేబూని
సుదతి నంపినరాక - చులకనగా చూచెగాని.

॥అవునమ్మ॥

[7] స్వాధీనపతిక : తా జెప్పినట్టువిని,కోరినట్టు చేయు నాయకుడు కలది. పతిని స్వాధీనమందుంచుకొని సంతోషించునది.

ఈ నాయిక చేష్టలు

[1] వన విహారము [2] మన్మథ సంబంధమైన ఉత్సవాదులను చేయుటయందు, చూచుటయందు కోరిక [3] మదించియుండుట [4] కాక నొందుట [5] తాకోరిన కోరికలు చెల్లించుకొనుట.

వ్యాపారములు

[1] మన్మధ పూజలు చేయుట, కనుట

[2] వన విహారము

[3] జలక్రీడ

[4] పుష్పాపచయము

[5] శుభ్రవస్త్రములను ధరించుట

(స్వీయ—మధ్య)

**స్వాధీనపతిక - క్షేత్రయ్యపదము**

ప. అమ్మా! యిటువంటివాని—కేమి సేయుదునే

అ. కొమ్మ! మువ్వగోపాలుని—గుణము చెప్పెద వినవమ్మ

॥అమ్మా॥

I. పయ్యెద చేపట్టుకొని—పాయజాలనని వాడు

సయ్యాటలాడుచున్నన్ను—చాల వలపించునమ్మ

॥అమ్మా॥

[8] అభిసారిక : ప్రియుడుండు సంకేత స్థలమునకు పోవునది. ప్రియుని తనవద్దకు రప్పించుకొనునది. ఈ నాయిక మూడు విధములు.

[1] జ్యోత్స్నాభిసారిక

[2] తమోభిసారిక

[3] దివసాభిసారిక

జ్యోత్స్నాభిసారిక : వెన్నెలలో తిరుగునది. ఈ నాయిక చల్లని చలువవస్త్రములు ధరించి, కర్పూరము, గంధము, మల్లె

పూలు, రవ్వల సొమ్ములు, ముత్యాలసరులు ధరించి వెన్నెలలో ప్రియుని జేరబోవును. ఎఱ్ఱని, నల్లని లేక నీలిరంగు దుస్తులు, నల్ల కలువలు నీలాలు లేక కెంపుల సొమ్ములు, కస్తూరి గంధము ధరించును.

దివసాభిసారిక : పగటివేళ జనసమూహామున్నప్పటికీ వారి నందరిని తప్పించుకొని ప్రియుని కలయునది.

చేష్టలు : సమయోచితముగ వేషమువేయుట ప్రజ్ఞ. శంక, నైపుణ్యము, బుద్ధి కుశలత, కపటము, సాహసము మొదలగు లక్షణములుకలది. ఈ లక్షణములు సాధారణముగ సామాన్య నాయిక యందే యుండును.

**సామాన్యాభిసారిక - క్షేత్రయ్యపదము**

ప. పిలువనంపె నన్నీ వేళ—ప్రేమమీరగ నిపుడు

అ. చెలియ మువ్వగోపాలుడు—చిత్తము రంజిల్ల నేడు

॥పిలువ॥

1. విరిబోణిరో! తమ్మని—విరుల జడను జుట్టి

పరువమైననాటికి—పైడి యిదే ననుచు

మరువకు మీమాట—మనకిద్దరి కీపూట

చెరుకు విల్తుడే సాక్షి—చెలియనిన నా సామి

॥పిలువ॥

**కులాంగనాభిసారిక (దివా)**

దేహమును మిక్కిలిగా కుంచుకొని భయపడుచు నలు ప్రక్కల జూచుచు శరీరమంతయు ముసుగుతో కప్పుకొనిపోవును.

ప. చూడరే అది నడిచే హొయలు—సుదతిచేయు జాడలు

అ. ఆడది కులకాంత అత్తింటి కోడలు—అల
గోపాలుని విడిదికి వెడలెను

1. కొండంత కాపురమె—రాను పోను కోమలి
కందలమె

దండున గెలిచె మగడు—తక్కువేమె తల
వ్రాత లేరికి తప్పింపవశమె

వీరెనమండుగురుగాక ఆధునికులేర్పరచిన ప్రవత్స్యత్పతిక, ప్రవసత్పతిక, సమాగ మిష్యత్పతిక, సమాగచ్ఛత్పతిక-అని మరి నలుగురు కలరు.

1. ప్రవత్స్యత్పతిక : ప్రియుడు దూరికి పోవుచున్నాడని, ఆ వియోగమును తలచుకొని దుఃఖించునది.

ఈ నాయిక చేష్టలు—ఎనిమిది

[1] రెండర్థములు వచ్చునట్లు మాట్లాడుట
[2] భయమిశితమైన చూపులు
[3] ప్రయాణము నిలిచిపోవుటను అభిలషించును
[4] విచారము
[5] తాపపడుట
[6] నిరాశ
[7] నిట్టూర్పు
[8] కన్నీరు నించుట

ఈ నాయికను తెల్పు క్షేత్రయ్యపదము

స్వీయ-ప్రౌఢ-ప్రత్స్యక్పతిక

ప. చాల యిందుకే నా మనసు-జాలి బొందెరా!

అ. తాళగలవా! కంచివర-దా! నే నిన్ను నెడబాయ ॥చాల॥

(1) ఇంతింత నా మోవితేనె-విచ్చి నోరు తడపగ
నింతలో సొమ్మసిల్లే-వింక యెలాగో
కంతు జనక నే నిచ్చిన-కౌగిలి వదిలేనని
యింతగా కన్నీరు నించే-వింక యెలాగో? ॥చాల॥

——— ——— ———

(2) ప్రవసత్పతిక : దేశాంతరము పోయెడి ప్రియుని చూచి దుఃఖించెడిది.

(3) సమాగ మిష్యత్పతిక : ప్రియుడు దేశాంతరము నుండి వచ్చుచున్నాడని తెలిసి సంతసించునది.

(4) సమాగచ్ఛత్పతిక : ప్రియుడూరి నుండి రాగా చూచి సంతోషించునది.

ఈ నాయిక చేష్టలు ఎనిమిది:

(1) అప్పటికప్పుడు కలిగిన సంతోషము
(2) హఠాత్తుగా కలిగిన గగుర్పాటు
(3) ఆశ్చర్యము గల చూపు
(4) వెనుకటి విరహమును పోగొట్టుకొనుట.
(5) ముఖము వికసించుట

(6) ఆనందాశ్రువులు

(7) సంతోషపు పలుకులు

(8) కోరికలు తీర్చుకొనుట.

(స్వీయ-మధ్య)- సమాగ చ్యుత్పతిక

క్షేత్రయ్యపదము

ప. నిన్ను జూడగలిగె-నే యిన్నాళ్ళకు

అ. నిన్ను జూచి నాలుగైదు-నెలలాయె మువ్వగోపాల

॥నిన్ను॥

[1] నిన్న రేయి కలలో నా-కన్నుల గట్టి

నట్లుండే

వెన్నుడా దిగ్గున లేచి-వెదకి కానక

కన్నీరుచే పైట దడిపి-కరగి చింత నొందితి

నన్ను దలచితో లేదో-నా నోము ఫలము

— — — —

నాయికలో మతాంతర భేదములు

మానవతి : ప్రియునియందు అన్యస్త్రీ ప్రయుక్తముగా కోపించును. ప్రియుడుచేయు మనశ్శాంతినిబట్టి యూరడిల్లును. ఈ నాయిక లఘుమాన, మధ్యమాన, గురుమాన యని మూడు విధములు.

[1] లఘుమాన : అన్యస్త్రీయందు ప్రియునికి కోరిక కలుగుటచే ప్రియునియందు కోపము గలది. ఇందు ప్రియుడు ఉపలాలించుటచే మనశ్శాంతి కలుగును.

[2] మధ్యమాన :-పతి అతిశయముచే మరియొక స్త్రీ పేరుచ్ఛరించిన కోపించునది. నాయకుడాన పెట్టుకొనుటవలన మనశ్శాంతి కలుగును.

[3] గురుమాన :-అన్యస్త్రీ సంభోగ చిహ్నములు చూచి కోపించునది. పాద ప్రణామంబులు, విలువైన బట్టలు, ఆభరణములు ఇచ్చుటవలన ఎంతో ప్రయాస తరువాత శాంతించును.

— — — — — — — — —

మరియు తృప్త, అతృప్త, తృప్తాతృప్త అను మూడు విధముల నాయికలు గలరు.

తృప్త : పురుష రతిచే తృప్తి చెందినది.

అతృప్త : పురుష రతిచే తృప్తి చెందనిది.

తృప్తాతృప్త : రతిచే కొంత తృప్తయైకూడ ఆశచేత అతృప్తిగా నుండునది.

[వీనిని గూర్చి వివరములు కళాశాస్త్రమునందు విపులముగా నివ్వబడినవి].

గర్వితః గర్విత యనగా గర్వించు నాయిక. ఈ నాయిక ఐదు విధములు.

[1] సౌందర్య గర్వితః తనయొక్క చక్కదనమును చూచుకొని గర్వించునది.

[2] ప్రేమ గర్విత : నాయకునికి తనయందుగల ప్రేమవల్ల గర్వించునది.

[3] విద్యా గర్విత : తను పండితురాలనని గర్వించునది.

[4] యౌవన గర్విత : పడచుదనముతో గర్వించునది.

[5] కుల గర్విత : తను ఎక్కువ కులము దానననీ గర్వించునది.

ఇందు మొదటి రెండును ప్రాచీనులొప్పుకొన్నారు. గర్వితకు వక్రోక్తి యుండవలసినట్లు ప్రాచీనులయభిప్రాయము.

వక్రోక్తి గర్వితకు క్షేత్రయ్యపదములలో చక్కని ఉదాహరణము.

ప. రమ్మనవే సముఖాన రాయబారము లేలే

అ. కమ్మవిల్తునిగన్న చక్కని మువ్వగోపాలుని ॥రమ్మనవే॥

1. సొగసు జేసుకవచ్చి సుదతులందరు జూడ వగలుచేసి తల-
వాకిట నిలిచి

తెగనాడే విధమేమో-దిన దినము క్రొత్తలాయ
యిగురుబోణిరో! వచ్చి-యెంతసేపాయెనో
॥రమ్మనవే॥

— — — — — — — — —

అన్యాసంభోగ దుఃఖిత : తనయొక్క ప్రియుడు మరియొక స్త్రీతో క్రీడించుటచేత ప్రియునియెడగాని, అన్యస్త్రీ యందుగాని కలిగిన క్రీడా చిహ్నములను జూచి దుఃఖించునది.

ప. ఏ రీతి బొంకేవురా ఓ రోరి ఏ రీతి బొంకేవురా

అ. ఏ రీతి బొంకేవు ఇదిగో నీ భుజమున దేరన
పసుపు దిగ్గులు

నీ మేనున జారిన కుంకుమ జక్కులు-నీ రెప్పలపై పేరినకాటుక కగ్గులు-వేణంగి రారా యేటికి సిగ్గులు.

— — — — — — — — —

(స్వీయ) అన్యాసంభోగ దుఃఖిత
క్షేత్రయ్యపదము

ప. ఏమో యీ వింతలు-యెక్కడిదే నీకు

అ. భామా మా మువ్వగోపాలు నిన్ను గూడెనో?

॥ఏమో॥

చ. చిక్కుపడిన హారములు-చెదరిన ముంగురులు
కక్కసమై నీ మోవిచాల-గంటి యున్నదిపుడు
పుక్కిటి విడెమున-బుగులుకొను వాసనలు
నిక్క చనుదోయిపై -నెలవంక గురుతులు

॥ఏమో॥

— — — — — — — — —

ఉత్తమ : ప్రియుడు అహితము జేసినను తాను హితమే చేయునది.

మధ్యమ : ప్రియుడుచేయు విధముగా తానును ప్రవర్తించునది.

అధమ : ప్రియుడు హితము జేసినను తాను అహితము చేయునది.

దివ్య : దేవతా స్త్రీ

అదివ్య : మనుష్య స్త్రీ

దివ్యా దివ్య : దేవతా స్త్రీ మనుష్య స్త్రీగా బుట్టినది.

(స్వీయ-ప్రౌఢ)- దివ్యా దివ్య-క్షేత్రయ్యపదము

ప. లేమరో! మా మువ్వగోపాలుడెందైన
లెస్సయుండితె చాలునే!

అ. వేమారు దూరేది తగవా? బావిలో నీరు
వెల్లువ బొయ్యీనటవే? యెంతటి దిటవే

లేమరో॥

చ. నా పుణ్యాను చక్కనౌ నాటి దినము లెల్ల
నన్ను చేపట్ట లేదా?

ఈ పట్ల విడనాడె వెన్నెల చీకటి-
యెవరికైన లేదా? వానితో వాదా?

॥ లేమరో॥

— — — — — — — — —

పద్మిని, చిత్తిని, శంఖిని, హస్తిని అను స్త్రీ జాతులను గూర్చి విపులముగా కళాశాస్త్రములో వర్ణింపబడియున్నది. మరియు ఈ జాతులకు అనుగుణములగు పురుష జాతులు-పద్మినికి పాంచాలుడు, చిత్తినికి కూచిమారుడు, శంఖినికి భద్రుడు, హస్తినికి దత్తుడు-గురించికూడ తెలుపబడియున్నది.

ఈ వివరములనుగూడ నర్తకుడు విధిగా చదువవలసియున్నది. ఎందుకనగా నాయికాభినయము చేయునపుడు ఈ నాయికలు ధరింపవలసిన ఆహార్యమును గురించి కళాశాస్త్రమెక్కువగా నుపకరించును. నాయికలయొక్క గుణములనుబట్టి వారియొక్క దుస్తుల రంగు, ఆభరణములు, అవయవములతీరు మొదలైన విషయములన్నియు చర్చించబడియున్నవి. క్షేత్రయ్య మొదలైన పదరచయితల పదముల నభినయించవలసివచ్చినపుడు ఆహార్యములో ఈ నాయికలయొక్క వర్ణన సరిపోవును.

ఉదా : పద్మిని జాతియొక్క ఆహార్యము, అవయవములతీరు స్వీయ నాయికకు ఉపయోగించవచ్చును. ఇట్లే ఇతర నాయికల విషయములలోగూడ.

పై నాయికలయందు సూక్ష్మమైన భేదములవల్ల ఎన్నో భేదములు పుట్టుచున్నవి.

మరియు ఒకే నాయిక రెండు మూడు నాయికా భేదములను పొందుట గలదు.

ఉదా : కలహాంతరిత నాయిక, ఖండితయై కోపించి భర్త వెళ్ళిన తరువాత విరహోత్కంఠితావస్థతో పశ్చాత్తాపము చెందును.

ప. మానినీ వినవే నే మందబుద్ధితోను మాటాడ
కుంటినే

అ. మానమే భూషణము మానవతుల కెల్ల
మాన మడలిన వెనుక ప్రాణమేటికె చెలియ॥

చ. ఇరుగు పొరుగు వార్త హితవుగ నేనెంచి
సరసునితో పొందు చాలు పొమ్మంటినే
మరుగేల చెనటుల మాటలు నేవిని
తెరవాన బ్రతుకిట్టి తెరగాయె నికనేల।

— — —　　— — —　　— — —

మరియు నిట్లే విప్రలబ్ధ అభిసారికయై పతిని గూడుటకు చని పతి యచ్చట లేకుండుటచే విరహమున చింతించుటచే నది విరహోత్కంఠితగా మారును. అవస్థా భేదముచేత నాయికా భేదము పుట్టును.

*　　*　　*　　*　　*

నాయికలనుగూర్చిన సూక్ష్మమైన వివరములు, వీరి నభినయించు విధానము, సాత్త్విక సంచారులు, ఆహార్య విశేషాదులను గూర్చి విపులముగా వ్రాసిన యిదే ఒక పెద్ద గ్రంథమగును. కనుక సంక్షిప్తపరచి క్లుప్తముగా వ్రాసితిని.

నాయకులు

పతి-వివాహితుడు-అందలి భేదములు.

[1] అనుకూలుడు-స్వస్త్రీయందే సర్వదా ప్రీతిగలవాడు.

[2] దక్షిణుడు-అందరి నాయికలయందు సమముగ ప్రేమ గలవాడు.

[3] ధృష్టుడు-అపరాధియై నాయిక వెళ్ళగొట్టినను, అచ్చటనే యుండి నాయికతో ప్రియంబులాడువాడు.

[4] శఠుడు-కాంతలయందు కపటముచేయగల సమర్థుడు.

ఉపపతి-జారుడు-ఇందు నాల్గు భేదములుండును.

వైశికుడు-వేశ్యల యందాసక్తి కలవాడు.

వైశికుడు-ఉత్తముడు, మధ్యముడు, అధముడు అని మూడు విధములు.

ఉత్తముడు-ప్రియురాలు కోపగించిన ఉపచారము చేయువాడు.

మధ్యముడు-ప్రేయసి కోపగించిననూ, తన కోపము బయల్పరపక చేష్టలచేత తన మనోభావమును ప్రకటించువాడు.

అధముడు-లజ్జ, భయము, కృపలను మాని కామక్రీడలందు కృత్యాకృత్య విచారణ లేనివాడు.

నర్మసచివులు-నాయకుల వ్యాపారములో తోడ్పడువారు. ఇందు నాల్గు భేదములు.

[1] పీఠమర్దకుడు-నాయకుని కంటె కొంచెముగా తక్కువ సమర్థుడు కుపితయైన నాయికకు పతియందనురాగము కల్గించువాడు.

[2] విటుడు-కళాశాస్త్రములో సామర్థ్యము కలవాడు.

[3] చేటుడ-నాయికా నాయకుల కూర్పుటయందు సమర్థుడు.

[4] విదూషకుడు-అంగ వికారాదులచే హాస్యరసము పుట్టించు వాడు.

నాయికకు సహాయులు ఇందలి భేదములు-

[1] దూతిక-నాయికా నాయకులకు అన్యోన్య సందేశమును తెల్పునది.

[2] దాసి-పరిచర్య చేయునది

[3] సఖి-సమవయస్సులోనున్న చెలియ

[4] చేటి-సంధాన చతుర

[5] ధాత్రీయ-దాది కూతురు

[6] ప్రాతివేశిని-ప్రియునికలుపుటకుత్సాహపరచునది

[7] లింగిని-కపట యోగిని

[8] సైరంధ్రి-సంసార స్త్రీగానుండి రాజస్త్రీల కలంకారములు చేయునది.

[9] శిల్పిని-మకరికా పత్రములు వ్రాయునది.

[10] శిశుక-ప్రియునివద్ద నడుచుకోవలసినతీరులు నేర్పునది.

[11] పరిహాసిక-హాస్యము చేయునది.

[12] నర్మసఖి-నాయిక తనయొక్క రహస్యములను తెలుపుకోదగిన సన్నిహితురాలు.

భామా కలాపములో సత్యభామయొక్క చెలికత్తె (మాధవి) పైని తెల్పిన అందరి స్వరూపమును దాల్చును.

**మహానాయకులు**

[1] ధీరోదాత్తుడు-ధైర్యవంతుడు, కరుణార్ద్ర హృదయుడు, సత్యవంతుడు, మనోదేహబలములు కలవాడు,

[2] ధీరోద్ధతుడు : శౌర్యము, దర్పము, వంచనయుకలవాడు.

[3] ధీరశాంతుడు: శాంతమును, సుగుణములును కలిగి ప్రకాశించువాడు.

[4] ధీరలలితుడు-సమస్త భోగములు కలవాడు.

**శృంగార వివరములు**

రతి-స్త్రీ, పురుషులకు కలుగు సంభోగ విషయములందభిలాష "రతి" యనబడును.

ఈ రతి శృంగార రసమునకు కారణమగుచున్నది.

శృంగార రస కారణమైన విభావము రెండు విధములు.

[1] ఆలంబనము : రతియను స్థాయిభావము, యెవరి నాశ్రయించి కలుగుచున్నవో అట్టి మనోహర నాయికా నాయకులు ఆలంబనము.

[2] ఉద్దీపనము : స్త్రీ పురుషులకు కలిగిన రతియం దిచ్ఛను వృద్ధి పొందించునది.

ఉదా : వయస్సు, సౌమ్యత, చేష్టలు - తటస్థములైన మలయమారుతము, చంద్రుడు మొదలైనవి.

అనుభావము : విభావముచేత హృదయములో రసోత్పత్తికలిగి వృద్ధిపొంది — కటాక్ష వీక్షణాదులచే దానిని బహిర్గతముగా ప్రకాశింపజేయుట అనుభావము.

**శృంగార చేష్టలు**

[1] భావము : రసాభిజ్ఞాన యోగ్యతా మాత్రము.

[2] హావము : ఆ భావము కొంచెముగా ప్రకాశించుట.

[3] హేల : ఆ భావమే బాగుగా ప్రకాశించుట.

[4] విలాసము : ప్రియుని చూచినప్పుడు నాయికకు కలుగు తాత్కాలిక చేష్ట.

[5] మాధుర్యము : రత్యాది సమయములలో భూషణలు లేకయే ప్రకాశించుట.

[6] ధైర్యము-అతి మోహము కలిగినను కులశీలాదుల నతిక్రమింపకుండుట.

[7] విభ్రమము-ప్రియుని యందే మనస్సు లగ్నమగుటచే ఆభరణములను వ్యత్యాసముగా ధరించుట.

[8] లీల-ప్రియునియొక్క గుణములను అనుసరించుటచే ప్రకాశించుట.

[9] కిలికించితము- ఉలికి పడుట, వెంటనే కోపపడుట, వెంటనే సంతోషం, అశ్రువులు-ఈ నాలుగుకూడిన చేష్టావిశేషము.

[10] మొట్టాయితము-కథాదులచే తన యభీష్టము నెరుక పరుచుట.

[11] లలితము-రమణీయమైన దేహ విన్యాసము.

[12] విచ్ఛిత్తి-ఆభరణము లల్పముగా నున్నను ప్రకాశించుట.

[13] బిబ్బోకము-ప్రియుని కథలయందనాదరము.

[14] విహృతము-తన యంగీకారమును మాటలచే కాక క్రియలచే తెలుపుట.

[15] చకితము-ముగ్ధత్వముచే భయపడుట.

[16] హసితము-సంతోషమువలన కలుగు నవ్వులవలన ప్రకాశించుట.

[17] కుట్టమితము-సురతానందమువలన దంత క్షతాదులను గుర్తెరగకుండుట.

[18] కుతూహలము-ప్రియవిషయక మోహ చాపల్యము.

రసాభాసములు

1. స్త్రీ, పురుషులలో ఒక్కరు మాత్రమే ప్రీతికలిగి యుండుట.

2. నీచుల రతిని అభిలషించుట.

3. ఒక స్త్రీకి అనేక పురుషులయందు ఏక కాలములో అనురాగమున్నట్లు తెలుపుట.

4. అనేక పురుషులకు ఏక కాలమందు ఒక స్త్రీయందు మోహము కలుగుట.

5. ఉత్తమ జాతి స్త్రీకి నీచుని యందు

ఉత్తమునికి నీచ స్త్రీ యందు
సౌందర్యవతికి కురూపి యందు
యౌవన స్త్రీకి వృద్ధుని యందు
రతి కల్గుట రసాభాసమనబడును.

[1] భావోదయము-ప్రారంభములో ఒక భావము కల్గుట.

[2] భావశాంతి-అట్లు కలిగిన భావము లుపశమించుట.

[3] భావసంధి-ఒకరికి కలిగిన భావము ఇద్దరి మనస్సులలో భిన్న భిన్న రసగత భావములుగా తోచుట.

[4] భావశబలత-ఏక రసగత భావములుగాని, భిన్న రసగత భావములుగాని పుట్టుచు, ఉపశమించుచు, మరల పుట్టుచు ఉపశమించుట. ఈ రీతిగ అనేక భావములు కలుగుట.

సాత్విక భావములు

(1) స్తంభము-కదలకుండుట, చలించకుండుట, ఏమియూ తోచక నిశ్చేష్టులగుట [ఇది పాదములందు పుట్టును]

(2) స్వేదము-చెమర్చుట. చెమటను తుడుచుకొనుట గాలిని ఇచ్చించుట, వ్యజనగ్రహణము మొదలైన అనుభవములు కల్గును.

(3) రోమాంచము-గగుర్పాటు, పులకరింత, ఇది సుఖాద్యతిశయమువలన కలుగును, (గగుర్పాటు శరీరమందంతటను పుట్టును.)

(4) స్వరభేదము-డగ్గుత్తిక, గద్గదిక స్వరము. ఇందు మాటలయందు స్వరభంగము కల్గును.

(5) వేపథువు-కంపము, వణుకు, స్మరించుట, దేహము వణకుట [అధరోష్ఠమందు పుట్టును]

(6) వైవర్ణ్యము-వెల వెల బోవుట, తెల తెల బోవుట, కాంతి మారుట (చెక్కులయందు పుట్టును)

(7) అశ్రువులు-కన్నీరు. ఇందు కన్నీరు విదలించుట కన్నులను తుడుచుకొనుట మొదలైనవి కల్గును.

(8) ప్రళయము-మూర్ఛ. ఇది మనస్సునందు పుట్టును.

పైని జెప్పిన సాత్వికములలో నుండు సంచారులు.

| సంచారి | సాత్విక భావములు |
|---|---|
| శ్రమ | స్వేదము |
| త్రాసము | స్తంభము, రోమాంచము, స్వర భేదము, వేపథువు |
| శంకలో | స్వరభేదము, వైవర్ణ్యము |
| ఆర్తిలో | స్తంభము, వేపథువు |

| | |
|---|---|
| రోషములో | స్వేదము |
| ఆవేగములో | రోమాంచము |
| ఉగ్రతలో | స్వేదము |
| విషాదములో | అశ్రువులు |
| మదములో | స్వరభేదము |
| నిద్రలో | స్వేదము, ప్రళయము |
| మృతిలో | వేపథువు |
| మదములో | స్వేదము, రోమాంచము |
| మోహములో | ప్రళయము |
| అపస్మృతిలో | స్తంభము, వేపథువు |

మన్మథ పంచబాణములు

[1] అరవిందము-స్త్రీ కుచములయందు దీని ప్రయోగము. ఉన్మాదము కలిగించును.

[2] అశోకము-ప్రయోగ స్థలము అధరము. రోదనము చేయుట దీని కార్యము.

[3] చూతము-ప్రయోగ స్థలము శిరస్సు. దీని కార్యము సమ్మోహము.

[4] నవమల్లిక-ప్రయోగ స్థలము నేత్రములు. దీని కార్యము దేహము శుష్కించుట.

[5] నీలోత్పలము-ప్రయోగ స్థలము గుహ్యము. దీని కార్యము మృతినొందుట.

ఈ పంచ బాణ ప్రయోగము నభినయించునప్పుడు మరణో ద్యోగమును గనుపరచి బాణ ప్రయోగము నిలుపవలెను. మరణము నభినయించకూడదు కనుక.

నవరసములు

శృంగార హాస్య కరుణా రౌద్ర వీర
భయానకాః
బీభత్సాద్భుత శాంతస్య రసః పూర్వే
ప్రకీర్తితాః

శృంగారము, హాస్యము, కరుణ, రౌద్రము, వీరము, భయానకము, బీభత్సము, అద్భుతము, శాంతములని రసములు తొమ్మిది.

శృంగార రసము-శృంగార రసము సంభోగ శృంగారము, విప్రలంభ శృంగారము అని రెండు రకములు. సంభోగ శృంగారము: బాహ్యాభ్యంతరరతులుగలది ఆలింగన, చుంబన, దంతక్షత, నఖక్షతాది భేదములుగలది అభ్యంతర రతి. విప్రలంభ శృంగారము: అభిలాష, విరహము, ప్రవాసము, మానము మొదలైన భేదములు కలిగియుండును. 1. అభిలాష: సంభోగానికి పూర్వము గల్గు మోహము. 2. విరహము: కలిసిన తరువాత యెడబాటుచే కలిగే పరితాపము. 3. ప్రవాసము: ప్రియుడుగాని, తానుగాని దేశాంతరములో నుండుటచే కలుగు విరహము. 4. మానము: ఇది రెండు విధములు. 1. ప్రణయమానము: ఇతర హేతువుచే ప్రియునియందు కోపము కల్గుట. 2. ఈర్ష్యామానము: అన్యస్త్రీ భోగముల ప్రియునియెడ కలిగెడు కోపము. ఈర్ష్యామానము పురుషులకు కలుగదు. కలిగిన యెడల రసాభాసమగును.

సంభోగ శృంగారములోని సంచారులు

దైన్యము, గర్వము, ఉగ్రత, నిద్ర, సుప్తి, జడత, ఆవేగము, అవహిత్థ, మోహము, అసూయ, గ్లాని, ధృతి, వ్రీడ, విబోధము, ఆధ్యానము, త్రాసము, స్మృతి, ఔత్సుక్యము, ముదము, శంక, చాపలము, మతి, వితర్కము,

ఇందు అనుభావములు

1. వికసించిన కనుబొమలచేత అందమైన చూపు
2. సుందరమైన, మృదువైన వస్త్రములు ధరించుట
3. తీయని పలుకులు
4. స్తంభాది సాత్విక భావములు
5. లీలాది చేష్టలు
6. ప్రసన్నమైన ముఖకాంతి

కోరికవల్ల శృంగారము పుట్టును

శృంగారమువలన పుట్టు సంచారులు

భయము, ఈర్ష్య, ఉన్మాదము, మదము, గ్లాని, నిద్ర, జడత, అవహిత్థ, శంక, విస్మయము, వ్రీడ, చింత, ఆవేగము, ఔత్సుక్యము, ధృతి, విషాదము, చాపలము, వ్యాధి, స్మృతి, మృతి.

వీరరసము: ఇది ఉత్సాహమువలన పుట్టును. పరేంగితమెరుగని అపకారులయందు పుట్టినది.

ఈ వీరము యుద్ధవీరము, దానవీరము, దయావీరము అని మూడు విధములు. ఇది ప్రసన్నమైన ముఖకాంతిచే ప్రకాశించును.

వీరరసములో పుట్టు వ్యభిచారులు:

మరణము, ఆవేగము, విబోధము, వితర్కము, రోషము, మోహము, ధృతి, ఉగ్రత, ఈర్ష్య, గర్వము, హర్షము.

కరుణరసము: ఇష్టజనవియోగములందు పుట్టును. దుఃఖము వలన కరుణరసము పుట్టును.

ఈ రసములో పుట్టు సంచారులు.

నిర్వేదము, సుప్తి, చింత, శంక, దైన్యము, నిద్ర, స్మృతి, మరణము, ఆలస్యము, మోహము, ఉన్మాదము, శ్రమము, విషాదము, వ్యాధి, గ్లాని, జాడ్యము.

అద్భుతరసము: ఎన్నడును చూడని దృశ్యము చూచినప్పుడు పుట్టును. అద్భుతరసము ఆశ్చర్యమువలన పుట్టును.

ఇందలి సంచారులు:

వితర్కము, చాపలము, ఆవేగము, హర్షము.

హాస్యరసము: వికృతాదిచేష్టలు చూచినపుడు కలుగునది. జనులను నవ్వించునది హాస్యము.

ఇందలి సంచారులు: ఔత్సుక్యము, స్మృతి, గర్వము, చాపలము, మదము, విబోధము, వ్రీడ, శ్రమము, విస్మయము, హర్షము, మతి.

హాస్యము ఐదు విధములు:

స్మితము-చిరునగవు

హసితము-సహజమైన నవ్వు

ప్రహసితము-ఒడలెరుగని నవ్వు

అపహసితము-పరిహాస యోగ్యమగు నవ్వు.

ఉపహసితము: ప్రథమములో నవ్వు కలిగిన దానికి కారణమును తలచుకొని మాటి మాటికి నవ్వుట.

భయానకరసము: భయంకరముగా నుండు దృశ్యమును చూచినప్పుడు పుట్టును. భయమువల్ల భయానకము పుట్టును.

ఇందలి సంచారులు:

| | | |
|---|---|---|
| త్రాసము | చాపలము | ఆవేగము |
| మోహము | శ్రమము | చింత |
| మృతి | జాడ్యము | విషాదము |

ఈ భయములో సాత్త్వికభావములన్నియు కలవు.

బీభత్సరసము: ఈ బీభత్సము విచారము వలన పుట్టును పూర్వోత్తరము కానక చేసి పశ్చాత్తాపబడుట.

ఇందు కలుగు సంచారులు:

నిర్వేదము, విషాదము, మోహము, శంక, జాడ్యము, అపస్మారము, దైన్యము.

రౌద్రరసము: తనకు బాధ కలిగించే శత్రువులయందు పుట్టును. రౌద్రము కోపమువలన పుట్టును.

ఇందు కలుగు సంచారులు:

| | | |
|---|---|---|
| అమర్షము | ఆవేగము | చాపలము |
| మదము | మోహము | ఉగ్రత |
| స్మృతి | గర్వము | |
| ఔత్సుక్యము | ఈర్ష్య | |

శాంతరసము: నిరాపేక్షుఁడై విరాగముపొందుట నవరసముల పుట్టుక.

కోరికవలన శృంగారము, నవ్వువలన హాస్యము, దుఃఖము వలన కరుణ, రోషమువలన రౌద్రము, ఉత్సాహమువలన వీరము, భయమువలన భయానకము, విచారమువలన బీభత్సము; ఆశ్చర్యము వలన అద్భుతము, శాంతమువలన శాంతము జనించును.

**సంచారి భావములు నభినయించురీతి**

నిర్వేదశ్రమ దైన్య జాడ్యములు గ్లాని

త్రాస శంకార్తిరు

ద్గర్వావేగ ధృతి స్మృతుల్ చపలతో
ర్గత్వావహిత్థా త్రపాం
తద్వైక్లబ్య మదోత్సుకత్వమతి నిద్రామోహా
బో ధాంతము
త్స ర్వాలస్య వితర్క సుప్త్యసహ తాధ్యాన
భ్రమాపస్మృతుల్

(1) నిర్వేదము (2) శ్రమ (3) దైన్యము (4) జడత (5) గ్లాని (6) త్రాసము (7) శంక (8) ఆర్తి (9) రోషము (10) గర్వము (11) ఆవేగము (12) ధృతి (13) స్మృతి (14) చాపలము (15) ఉగ్రత (16) అవహిత్థ (17) త్రప (18) విషాదము (19) మదము (20) ఔత్సుక్యము (21) మతి (22) నిద్ర (23) మోహము (24) విబోధము (25) మరణము (26) ముదము (27) ఆలస్యము (28) వితర్కము (29) సుప్తి (30) అసూయ (31) ఆధ్యానము (32) భ్రమ (33) అపస్మృతి.

నిర్వేదము: దుఃఖము. గత శోకకృత్యములను తలచినపుడు పుట్టును. నిరాశ జేసికొనుటయే నిర్వేదము.

నిర్వేదము నభినయించవలసిన పద్ధతి: (1) విచారము (2) నిట్టూర్పు (3) దైన్యము.

వివరములు: [1] కన్నీటి నడ్డగించుటచేతను లేక అశ్రుపూరిత నేత్రములచేతను [2] నిట్టూర్పులు [3] నమస్కరించుట, వేడుకొనుట, శరీరమును కుంచించుకొనుట [4] మాటలయందు, ముఖమునందు పేదరికము [5] డగ్గుత్తిక [6] వైవర్ణ్యము [7] వెల వెల బోవుట- వీనిచే అభినయించవచ్చును. కరుణ, బీభత్సరసములలో నిర్వేదము పుట్టును.

శ్రమను: శ్రమము-ప్రయాసము.

శ్రమనభినయించు విధానము: [1] చెమట బిందువులు తుడుచుకొనుట [2] నిట్టూర్పులు [3] నీడయందు నిల్చుండుట [4] నిమీలిత నేత్రములు [5] విసురుకొనుట [6] మందముగ నడచుట.

శ్రమ హాస్య కరుణ రసములయందు పుట్టును.

దైన్యము: దీనత్వము

అభినయించు విధానము: 1 బలమును విడుచుట (2) అతిశయము నడచుకొనుట (3) మాటలందు, నేత్రములందు పేదరికము, హీనత్వము (4) శరీరమును కుంచించుకొనుట (5) నమస్కరించుట, వేడుకొనుట.

జడత: వ్యాధి—మాంద్యము

ఇష్టమునుగాని, అయిష్టమునుగాని అనుభవించుట (మొదలైనవాని చేత తన్ను తామరచుట.

అభినయించు విధానము: [1] రెప్పపాటు లేకయుండుట (స్తంభము) [2] పరవశమగుట [3] ఊరక యుండుట, చెవులు వినబడకుండుట.

భయానక, బీభత్స, కరుణ, శృంగార రసములందు పుట్టును.

గ్లాని: బాధ

అభినయించు విధానము: [1] దేహము చిక్కుట [2] సన్నని పలుకులు [3] మెల్లని పనులు, ఉత్సాహము లేకయుండుట. [4] వెల వెల బోవుట [5] గుడ్లు తిరుగుట.

భయానక, కరుణ, శృంగారములందు పుట్టును.

త్రాసము: భయము

[1] శరీరము వణకుట [2] శరీరము ముడుచుకొనుట [3] రోమాంచము [4] చిత్తభ్రాంతి [5] భ్రమ మొదలైన వానినభినయించవలెను.

త్రాసము బీభత్స, భయానక, శృంగారములందు పుట్టును.

శంక: సంశయము

[1] వర్ణము మారుట [2] స్వరభంగము [ ] దిక్కులు జూచుట [4] ముసుగిడుకొనుట మొదలైనవానిచే నభినయించవలెను.

ఇది శృంగార, కరుణ, బీభత్స రసములందు పుట్టును.

ఆర్తి: వ్యాధి

[1] దేహము స్తంభించుట [2] అంగముల బిగి సడలుట [3] అరచుట [4] ముఖము వంక బోవుట [5] నిట్టూర్పు మొదలైన వానిచే నభినయించవలెను.

ఇది కరుణ, శృంగారములందు పుట్టును.

రోషము: అమర్షము

[1] స్వేదము [2] తల వంకించుట [3] చింతించుట [4] ఉపాయము వెదకుట [5] ఉత్సాహపడుట [6] తర్జన భర్జనలు వీనిచే కనబర్చవలెను.

ఇది వీర, రౌద్ర రసములందు పుట్టును.

గర్వము:

[1] అహంభావము [2] అనుగ్రహ ప్రధానము [3] మోము త్రిప్పుకొనుట [4] మాటాడక యుండుట [5] తన అవయవములను

చూచుకొనుట [6] ఒడలు విరుచుట మొదలగువానిచే ప్రవర్తింపవలెను.

ఇది వీర, రౌద్ర, శృంగార, హాస్యరసములందు పుట్టును.

ఆవేగము:

ఇది ఎనిమిది విధములు: [1] ఉత్పాహావేగము [2] వాతావేగము [3] వర్షావేగము [4] అగ్న్యావేగము [5] మత్తకుంజరదర్శనావేగము [6] ప్రియ శ్రవణావేగము [7] అప్రియ శ్రవణావేగము [8] శాత్రవ వ్యసనావేగము.

ఇష్టాయిష్ట జ్ఞానమువల్ల పుట్టిన ఆత్రత, తొందరయే ఆవేగము. ఇందు-ఇష్టప్రాప్తివల్ల కలిగిన హర్షాదులవల్లను, అయిష్టప్రాప్తి వల్ల కలిగిన శోక, స్తంభాదులచేతను అభినయించవలెను.

ఇది అద్భుత, వీర, శృంగారములందు పుట్టును.

ధృతి: ధైర్యము

[1] సంతోషము [2] చింతలేక యుండుట [3] లభించిన దానిని అనుభవించుట.

ఇది వీర, శృంగారములయందు పుట్టును.

స్మృతి: జ్ఞాపకము

[1] కనుబొమలు ఎగురవేయుట [2] తల ఆడించుట.

పూర్వమందు అనుభవించిన వానిని స్మరణజేయుట స్మృతి. ఇది అద్భుత, కరుణ రసములయందు పుట్టును.

చాపలము: చపలత్వము

రాగద్వేషముల వలన నిలకడలేక యుండుట చపలత్వము.

[1] చెలులను దండించుట [2] దృష్టియందు చంచలత్వము [3] విలాసమైన చిరునవ్వు [4] కంఠాభరణములను కదల్చుట [5] ఆజ్ఞాపించుట మొదలైనవి చెల్లును.

ఇది రౌద్ర, శృంగారములయందు పుట్టును.

ఉగ్రత:

[1] జడిపించుట [2] కొట్టుట, కట్టుట [3] కళ్ళెర్ర జేయుట, కన్నులు, ముఖము ఎర్రనగుట మొదలైన వభినయించ వలెను.

ఇది వీర, రౌద్ర రసములయందు పుట్టును.

అవహిత్థ: అంగ గోపనము

[1] బొంకుట [2] ధైర్యము కనబరచుట, తలవంచి కాలి బొటనవ్రేలితో నేలను వ్రాయుట, వేరొక విధముగ పలుకుట, చూచుట మొదలైన వభినయించవలెను.

త్రప లజ్జ

[1] మరుగు మాటలు [2] తల వంచుట, ఓర చూపు [3] యోచించుట, బయటకు రాకుండుట [4] ముసుగిడుట [5] గోళ్ళు గిల్లుట, నేల గీరుట [6] చూపులయందు ఎక్కువగా రెప్పపాట్లు వీనిచే నభినయించవలెను.

ఇది శృంగారమందు పుట్టును.

విషాదము:

[1] ఏమియు తోచక ఉపాయమును వెదకుట [2] చేతులు పిసికికొనుట [3] ముఖమున విచారము మొదలైనవి అభినయించ వలెను.

ఇది బీభత్స, శృంగార రసములయందు పుట్టును.

మదము:

[1] మాటలలో తొట్రుపాటు, పెద్దగా నవ్వులు, ఏడ్పు [2] శరీరము తూలుట మొదలైన వభినయించవలెను.

ఇది వీర, బీభత్స, రౌద్ర శృంగారములయందు పుట్టును.

మతి:

[1] బోధనము చేయునట్లు కనబడుట [2] సంతోషము [3] శంక నివారణమైనట్లు కనబడుట [4] కనుబొమల నాడించుట [5] సంశయములబోగొట్టుట వీని నభినయించవలెను.

ఇది బీభత్స రసమందు పుట్టును

ఔత్సుక్యము: ఉత్సాహము

[1] వేగముగా నడచుట [2] శరీరము బరువగుట [3] శయనించుటయందభిలాష [4] తాళలేకపోవుట [5] నిట్టూర్పు [6] చింత, సంతాపము మొదలైనవి కనబరుపవలెను.

ఇది బీభత్స, రౌద్ర, శృంగారములయందు చెల్లును.

నిద్ర:

(1) శరీరము విరుచుకొనుట (2) ఆవులించుట (3) కన్నులు మూయుట (4) తెలివిలేక యుండుట (5) దేహమందు చెమట బోయుట మొదలైనవి అభినయించవలెను.

ఇది శృంగార, హాస్యములయందు పుట్టును.

మోహము:

(1) నిద్ర చెందినవానివలె కనబడుట (2) గుడ్లు తేల వేయుట (3) శరీరము పడిపోవుట (4) దేహము మరచియుండుట మొదలైనవి అభినయించవలెను.

ఇది అద్భుత, వీర రసములయందు పుట్టును.

విబోధము:

విబోధము అనగా ఎరుకను చెందియుండుట

(1) భుజములు పైకి ఆడించుట (2) చిటికెలు వేయుట (3) ఒళ్ళు విరుచుకొనుట (4) కన్నులు నలుపుకొనుట క్రమముగా తెరుచుట (5) ఆవులింతలు.

ఇది వీర రసమందు పుట్టును.

మృతి మరణము అనగా శరీర త్యాగము

1. ఎక్కిళ్ళు 2. శ్వాసలు 3. వెన్నెల సేవ చేయుట 4. మలయమారుతమునకు శరీరము నర్పించుట మొదలైన వాని నభినయించవలెను.

ఇది భయానక, శృంగార, వీర రసములయందు పుట్టును.

ముదము: హర్షము

1. ముఖమునందు, నేత్రములయందు వికాసము 2 పులకలు పుట్టుట 3. చెమట వేయుట అభినయించవలెను.

ఇది వీర, రౌద్ర, అద్భుతమందు పుట్టును.

ఆలస్యము: జాగు

1. శరీరము విరుచుకొనుట 2. ఆవులించుట 3. పనులు చేయుటయందు బద్ధకము 4. కూర్చుండుటయందాసక్తి మొదలైనవి అభినయించవలెను.

ఇది శృంగార, అద్భుత కరుణలయలందు పుట్టును.

వితర్కము: సంశయము

1. కనుబొమల నెగురవేయుట 2. తల నాడించుట 3. ఆలోచించుచున్నట్లు కనబరచుట అభినయించవలెను.

ఇది వీర రసమందు పుట్టును.

సుప్తి:

1 ఉచ్ఛ్వాస, నిశ్వాసములు 2. ఇంద్రియములయందు నిశ్చలత్వము 3 కన్నులు మూసుకొనుట కనబరుపవలెను.

ఇది హాస్యమందు పుట్టును

అసూయ:

1. మోము త్రిప్పుట 2. నిందించుట, భ్రూభేదము 3. గర్వము 4. తిరస్కారము 5. దౌర్జన్యము మొదలైనవి అభినయించవలెను.

ఇది వీర, రౌద్ర, శృంగార హాస్యములయందు పుట్టును.

అధ్యానము: చింత

1. మేనుచిక్కుట 2. తలవంచుట 3. సంతాపము 4. నిట్టూర్పు ఇది కరుణ, శృంగార, భయానకములయందు పుట్టును.

భ్రమ:

భ్రమయనగా చిత్తవిభ్రమము, వెఱ్ఱితనము

1. నిమిత్తములేని నవ్వు 2. సంబంధములేక మాట్లాడుట 3. హేతువులేక పరుగిడుట 4. కూర్చుండుట, లేచుట, ఏడ్చుట 5. జీవముగల మనుష్య. పశు, పక్ష్యాదులతోను, జడపదార్థముల తోను సమానముగా మాట్లాడుట-వీని నభినయించవలెను.

ఇది కరుణ, హాస్యములయందు పుట్టును.

అపస్మృతి: అపస్మారము

1. పండ్లు కొరుకుట 2. వణకుట 3. పరుగెత్తుట 4. స్తంభము 5. తిరుగుట 6. నోటి చొల్లు కార్చుట 7. నోట నురుగు కలుగుట మొదలైనవి అభినయించవలెను.

ఈ 33 సంచారుల అభినయమును గూర్చి సంక్షిప్తముగ వ్రాయబడినది.

# అభినయము - సాత్త్విక ప్రధానము

శృంగార రసప్రధానమై నాయికా వర్ణనలతో కూడియుండి, సాత్త్విక సంచారి భావముల నభినయించుట కనువైనట్టి విలంబిత లయలో నుండు సంగీత రచనా విశేషములు పదములు.

క్షేత్రయ్య, అన్నమయ్య, సభాపతి, మాతృభూతేశులు, వీర భద్రయ్య, సారంగపాణి మొదలైన వారి పదములు, పరిమళరంగ, మన్నారు రంగ, యువరంగ, కస్తూరిరంగ, వెంకటేశ, శివరామపుర, జటపల్లి గోపాల ముద్రగల పదములు, జయదేవుని అష్టపదులు, కృష్ణ కర్ణామృత శ్లోకములు, పుష్పబాణ విలాసము,అమరుకములోని శ్లోక ములు త్యాగయ్య, పురందరదాసుల కీర్తనలు, జావళీలు మొదలైన సంగీత రచనలలోని భావము సాత్త్విక ప్రధానమైన అభినయము ద్వారా ప్రదర్శింపబడును.

### పదములు - వానినభినయించు విధానము

పదాభినయమందు మనము ముఖ్యముగ గమనింప వలసిన విషయములు :

అభినయ వివరములు : లోకధర్మి, నాట్యధర్మి.

చతుర్విధాభినయములు : ఆంగికము, వాచికము, ఆహార్యము, సాత్త్వికము.

కావలసిన హంగులు : రంగస్థలము, రంగాలంకరణము, వంత పాట.

1. ఆంగికాభినయము : పదాభినయమందు సాత్వికము ప్రాధాన్యము వహించును. ఆంగికమునందు ముఖ్యమైన హస్తాభినయము (ముద్రలు) యెక్కువగా నుండవు. భంగిమలు ప్రదర్శించు సమయము లందు గూడ అవి కదులుచున్న శిల్పములవలె నుండును కాని నృత్యమునందువలె యెక్కువగా కోణములను కలిగియుండవు.

అశ్రువులు, స్తంభము, స్వరభేదము, స్వేదము, కంపము, వైవర్ణ్యము, ప్రళయము, రోమాంచము - ఈ ఎనిమిది సాత్త్విక భావములు.

ముప్పది మూడు సంచారుల యొక్క ప్రదర్శనతో శృంగార రసప్రధానమైన పదాభినయము నిండియుండును.

శబ్దనృత్య మందు ఆంగికముతో ఆ గీతములలోని భావములు (అర్థాభినయము) ప్రకటింపవచ్చును. పదములందట్లుగాక ఆంగికము, సాత్వికము, కలిసినగాని అభినయము సంపూర్ణత్వము నొందదు.

2. వాచికము : పదములను భావపూరితముగ అభినయించుటకు వాచికము చాల ముఖ్యము. పాటకుడు పదము పాడునప్పుడు రాగతాళములకే ప్రాధాన్య మివ్వక, ఆ పదములోని భావమునకు తగినట్లు కంఠమును హెచ్చు తగ్గులుగ సవరించుచు, ధ్వనిలోని మాధుర్యము కనబరచుచు, పదములోని భాష ప్రేక్షకులకు అర్థమగునట్లు పాడవలెను. (emotional type of music).

ఉదా : "కమ్మ విల్తుని గన్న చక్కని మువ్వగోపాలుని
రమ్మనవే సముఖాన రాయబారము లేలే"

(వితర్కం, దైన్యం)

"రాయబారము తేలే" అన్నప్పుడు వితర్కం, దైన్యం — ఈ రెండు సంచారులను పాటకుడు తన గాత్రములో చూపవలెను గదా-కనుక "రాయబారము తేలే" అన్నప్పుడు ఆ రాగ స్వరము మారకుండ ప్రథమములో గొంతును కొంచెమెత్తి పాడి మరల దీనత్వమొలుకునట్లు గొంతును తగ్గించి పాడినచో నర్తకి చేయు అభినయములోని రసము వాచికముద్వారా పోషింపబడి ప్రేక్షకుల కభినయమతి సులభముగ నర్థమై వారారసము ననుభవింప గలుగుదురు. అభినయమెంత ముఖ్యమో, దాని ననుసరించి పాడు పాటకుని గానముకూడ నంత ముఖ్యమే. పాటకుడు రాగతాళ లయలనే గాక సాహిత్యములోని మాధుర్యము నర్థము జేసికొని, అనుభవించి, అభినయములోని సంచారులను బాగుగ నెరిగినవాడై అనుసరించి పాడవలెను (ఇది నట్టువ పని) మార్దంగికుడు లయ ప్రధానముగ మాత్రముగాక ధ్వని ప్రధానముగ మృదంగము పలికింపవలెను.

3. ఆహార్యము : పదాభినయము ప్రత్యేకంగా సాత్విక భావ వికాసము గలిగియుండు నట్టి కేళికారీతి నర్తకనర్తకీ జనము తన ప్రతిభ కనబర్చుటకు చక్కనిఅవకాశముయిండుండును. నాటకములందువలే శుద్ధ సాత్వికాభినయమందు రంగాలంకరణ, ప్రత్యేక పద్ధతి దుస్తులు వేషధారణ అవసరముండదు -నాటకములందు నాయికల, ప్రదర్శనతీరు వేరుగనుక అందు అలంకరణ అత్యావసరము. ఇందు అట్టి అవసరము లేదు.

రంగస్థలము

1. సాత్వికము : నాట్యధర్మి, లోకధర్మి నెరిగిన వాడే పదాభినయము చక్కగా చేయగలడు. సాత్విక భావముల నభినయించుటకు లోకధర్మి సహాయ మత్యావసరము.

నాయికాభినయములో ఒక సంచారి భావమును యెంతవరకభిన

యించిన ఉచితమో, ఆ నాయిక యొక్క స్వరూపము చెడకుండ పోషించుట కుపకరించునో, అంతవరకు తీసికొనవలయునుగాని శాస్త్ర ములో చెప్పిన విధానము లన్నిటిని అభినయించినచో రసాభాస మగును.

ఉదా :

"కమ్మ విల్తుని గన్న చక్కని మువ్వగోపాలుని
రమ్మనవే సముఖాన రాయబారము లేలే"

| | | | |
|---|---|---|---|
| రమ్మనవే | సముఖాన | రాయబారము | లేలే |
| ఔత్సుక్యం | గర్వం | వితర్కం | దైన్యం |

ఇందు "దైన్యము" నభినయించుచున్నామను కొందము. దైన్యము, దుఃఖము, మనోవ్యాధి, రోగము, దారిద్ర్యము, మనస్సు వ్యాకుల పడుట వీనివల్ల కలుగును. వీని నభినయించు విధము.

1. బలము విడుచుట 2. అతిశయ మడచుకొనుట 3. మాటల యందు, నేత్రములందు పేదరికము 4. శరీరము కుంచించుకొనుట 5. నమస్కరించుట 6. వేడుకొనుట.

పై చెప్పిన ఆరు విధములలోనే యే భావముల నభినయించిన "రమ్మనవేసముఖాన రాయబారము లేలే" అన్నప్పుడు మన కుపయోగించునో లేదో ఆలోచింతము.

ఇందు నాయిక సామాన్య, ప్రౌఢ, వక్రోక్తి, గర్వితము.

అదియునుగాక దైన్యమునకు ముందు "వితర్కము" నభిన యించుచున్నాము. కనుక పైన చెప్పిన ఆరు విధముల నభినయిం చుట సమంజసముగ నుండదు.

గనుక 1, 2, 4, 5, 6 ఈ నాయికత్వమునకు సరిపడవు.

ఇక మిగిలినది మాటలయందు, నేత్రములందు, మాటల యందు పేదరికము వాచికమునకు సంబంధించినది, కనుక వంతపాటకుడు అనుసరించవలెను. కావున నేత్రములందు పేదరికము మాత్ర మొప్పును. కాని ఈ నాయికయందు రేఖా మాత్రముగనైన దైన్య మొప్పునా ? అని సంశయము కలుగవచ్చును. ఇట్టి సమయమునందే మనకు "లోకధర్మి" ఉపకరించును. ఈ నాయికయందు మనము "ఔత్సుక్యములో ప్రారంభించి, గర్వము, వితర్కము" అభినయించితిమి. తరువాత పసిపిల్లలు గారాబము చేయునట్లు ముద్దు ముద్దుగా ఒక్కసారి "రాయబారము లేలే" అని ముఖము పెట్టి కొంచెము జాలిగ దృక్కులనుంచి అభినయించి ముగించిన నాయిక మరింత చక్కగ పోషింపబడును. ఈమె సామాన్య గనుక ఆ భావము పట్టిన గూఢ దోషముండదు.

పదాభినయము కూర్చునపుడు మనము ముందుగ ఆ పదము నంతయు బాగుగ చదివి, ఆ పదములో వర్ణింపబడిన నాయిక, స్థాయి, సాత్త్విక, సంచారి భావములను గూర్చి క్షుణ్ణముగ నాలోచించి, ఏయే సంచారులను, ఆ సంచారులలోనే యే భాగములను ఎంతవరకు అభినయించిన ఆ నాయికను పోషించుట కనుకూలించునో గుర్తించుకొని, వంత పాటకునికి గూడ, ఆ భావమునననుసరించి కంఠము సవరించి పాడునట్లు అభ్యసింపజేసి అభినయించుట చాల ఆవశ్యకము. అట్లు చేయనిచో ఆ నాయిక యొక్క స్వరూపమును సృష్టించలేము.

హస్తాభినయములో కొన్ని సమయములందు చేయు పొరబాట్లు : ..

అందు సాధారణముగ పట్టెడి శిఖర హస్తమును గూర్చి వ్రాయుదును.

అభినయము నందెవరినైన ప్రశ్నించునపుడు ఎవరు, ఏమిటి మొదలైన మాటలయందు కుడిచేత శిఖరము పట్టి, తలను ప్రక్కలకో ముందునకో ఆడించి, బొమముడితోనో, బొమలనెగుర వేయుటతోనో ముగింతుము.

ఉదా :

"వివరింపుమమ్మ ఈ విధము తెలిసి యిపుడెవరివల్ల దుడుకు?"

"ఎవరివల్ల" అన్నప్పుడు శిఖర హస్తము సమంజసముగనే యుండును.

కాని —

"గోపాలుడు మోడి చేసుకున్నాడు

మొన్నాటాల నుండి రాడు, నీతోడు

నేనెవ్వరి నంపుదు"

ఇచ్చట — "ఎవ్వరి" నన్నప్పుడు శిఖరము పట్టినచో ఈ పదము లోని భావమునకు సరిపోదు.

ఇక ఇచ్చట "ఎవరి" నన్నప్పుడు "ముకుళ" హస్తముతో ప్రారంభించి క్రమేణ దానిని, చేతులను ఒక ప్రక్కకు పొడిగించి వికసింపజేసి అలపద్మముల ఆకారములోనుంచి తలను ప్రక్కలకు మెల్లగ నాడించిన ఆ భావము చక్కగ వెల్లడి యగును. అభినయము కూడ సహజముగ నుండును.

సాత్త్విక భావములైన గగుర్పాటు, అశ్రువులు మొదలైన వానిని 1. రంగస్థలముపై నభియించునప్పుడు 2. ఏదైన హాలులో నర్తనమాడు పాత్రకు దగ్గరగ ప్రేక్షకులు కూర్చుండినప్పుడు అభినయించవలసిన విధానము ;

స్టేజిమీద అభినయించునప్పుడు ప్రేక్షకులు మనకు దూరముగ నుందురు. రోమాంచకను మొదలగు భావముల నభినయించునప్పుడు ఆఖరులో కూర్చున్న వారికి మన శరీరముపై కలుగు మార్పులు కనపడక, అర్థముకాక కొన్ని వేళలందు విసుగు తోచును. ఇది సహాజమే. ఎందుకనగా సామాన్య స్థితిలోనున్న శరీరమును పులకాంకితము వరకు అభినయించుటకు తయారవవలెనన్న కొన్ని యవస్థలు మారుటకు కొంత సమయము పట్టును. కొన్ని భావములను క్రమేణ అభినయించినగ్గాని ఆ స్థితికి పోలేము. దగ్గరనున్న వారికి ఈ మార్పులన్నియు చక్కగ కనబడినను, దూరముగనున్న వారు వాని ననుభవింపలేకపోవుటచే విసుగు చెందుట సహాజమేగదా! కాన నర్తకుడీ సమయములందు భంగిముల, ఆంగికాభినయము యొక్క సహాయము తీసికొనవలెను.

ఉదా :

'అశ్రువుల' నభినయించుచున్నామనుకొందము. ప్రేక్షకులు దగ్గరనున్న నిశ్చేష్టముగనున్న నేత్రములలో క్రమేణ నీరు యెట్లు క్రమ్మునో, ఆ నీరు బిందు రూపమును దాల్చు విధానము కొలకులందు మంచి ముత్యములవలె యెట్లు నిలుచునో, చివరకు కొలకుల నుండి ధారగ యెట్లు ప్రవహించి చెక్కిళ్ళనుండి జారిపడునో దీనిని ఒకటి తరువాత యొకటి మన మభినయించిన ప్రేక్షకులు ఆ సాత్విక భావములనుజూచి ఆనందించగలుగుదురు.

కాని స్టేజిమీద ఇట్టిది సాధ్యమా?

కనుక అట్టి సమయములందు దీనత్వము కనబరచు భంగిమను పట్టి చీర చెరగుతో కన్నుల నద్దుకొన్నట్లు, లేక మయూర హస్తముతో కన్నీటిని యెగజిమ్మునట్లు అశ్రుపూరిత నేత్రములు, జాలి చూపులు వీనిని సహాయముగ తీసికొనవలసిన అవసరము కలుగు

చున్నది. ఇట్లు చేసిన అందరు అభినయము చూచుటకు వీలుండటచే ఆనందించగలుగుదురు.

(1) పండితుల సభలందు

(2) అన్ని తరగతుల ప్రేక్షకులతోగూడిన సభలందు అభినయించు విధానము.

పండిత సభయందు అభినయించునప్పుడు:

"నాట్యధర్మి", "లోకధర్మి" ననుసరించి అభ్యసించిన అభినయమును చూచుటతో పండితులు తృప్తిపడరు. లలిత కళలకు సంబంధించిన శాస్త్ర, పురాణములందుగూడ నర్తకులకెట్టి పాండిత్యమున్నదో తరచి చూచినగాని వారు తృప్తిచెందరు. అట్టి తరి మనస్సు సామాన్యముగ రంగస్థలముపై అభినయించునట్లు యెక్కడికక్కడ సంక్షిప్తపరచి క్లుప్తముగ ప్రదర్శించిన అభినయము రుచింపదు. పూర్వము ఒక్కొక్క పదము గంటలతరబడి అభినయించిరనిన కేవలము ఆ పదములోని స్థాయిభావము దానిననుసరించి సాత్విక సంచారులను మాత్రమే అభినయించినగాదు.

ఉదా :

"కమ్మ విల్తునిగన్న చక్కని నువ్వగోపాలుడు"

"చక్కని" అన్నప్పుడు నల్లని మేనువాడు, మెరుగు చామన చాయవాడు, కుంటిల కుంతలుడు, విదియ చందురునిబోలు నొసలు, కమలరేకులవంటి కన్నులు ఇటుల కృష్ణుని నఖశిఖ పర్యంతము వర్ణించి, గోపాలునికి-గోవులు కాయువాడు, మురళీధరుడు, కౌస్తుభ భూషణుడు, శిఖిపింఛధారి, కాళియమర్దనుడు, గోపికా వస్త్రాపహారి, నవనీతచోరుడు, నందకుమారుడు, బృందావనవిహారి, గోవర్ధనధారి, రాధికాలోలుడు, ఇత్యాది లీలల నభినయించి అంతటితో ఆగక

'విటరాయడు', నయములెన్నో చేయువాడు, 'సరసము వాని సొమ్ము' (ఇక యిచ్చట నఖక్షతము, ఆలింగనము, చుంబనము మొదలైన శృంగార చేష్టలెన్నో), కళలంట నేర్చినవాడు మొదలైన వానిలో ఆ పదములోని స్థాయిభావమును రంజింపజేయుచు సాత్విక సంచారి భావములందు విజృంభించి అభినయించుచుండిరి.

ఇక ఈ విధమున రంగస్థలముపై అనుసరించిన ప్రేక్షకులకు విసుగు జనించక తప్పదు.

భగవదారాధనకొరకు దేవళములలో నృత్యముజేయు కళారాధకులు తప్ప-ఇతర నృత్యకళోపాసకులందరు ప్రేక్షకులయొక్క మెప్పు బడయుటకు కొంతవరకైన ప్రయత్నింతురుగదా! కనుక శాస్త్రవిషయములను నర్తకులు సంపూర్ణముగ నభ్యసించినను ప్రదేశమును ప్రేక్షకులననుసరించి వారి కానందమునిచ్చు విధముగ శాస్త్రీయ దృక్పథము చెడకుండ క్లుప్తపరచి అభినయించుటవసరము.

నాయికయొక్క స్వవచనముగనున్న పదము లెక్కువగ అభినయమునకు పనికివచ్చును. చెలియొక్క వాక్యములుగ నున్నవి అంతగా రాణించవు.

ఉదా :

"చేపట్లు కావచ్చునా? మీలో మీకు
చేపట్లు కావచ్చునా?
యేపట్లకైనను నెంచదగును మిమ్ము
ఈ పట్లలో మీకింత తాలిమి లేక"

మొదలైన పదముల అభినయమందు నర్తకి తన అభినయ సామర్థ్యమును చూపుట కవకాశముండదు.

కొన్ని పదములు వర్ణనలతో నిండియుండి చిత్రములు గీయుటకు, చదువుకొని ఆనందించుటకు పనికివచ్చును. సాత్వికాభినయములో విజృంభించుట కవకాశముండదు.

ఉదా :

మగువ తన కేళికా మందిరము వెడలెన్
వగకాడ మాకంచివరద తెల్లవారెననుచు
॥మగువ॥

నిడజారు గొజ్జంగి—విరిదండ జడతోను
కడు చిక్కుపడి పెనగు—కంటసరితోను
నిడుద కన్నులదేరు-నిదుర మబ్బుతోను
తొడరి పదయుగమున—తడబడెడు నడతోను
॥మగువ॥

మరికొన్ని పదములందు సమర్థుడైన నర్తకుడు తన ప్రతిభను వెల్లడి చేయుటకు జాగాలెన్నో యుండును.

ఉదా :

కలికి సొగసైన నీ కనులు వ్రాసితిగాని
బెళుకుచూపులు వ్రాయు విధమెరుగనైతి

సొగసైన కనులు—హరిణాక్షి, కమలాక్షి, తరలాక్షి, మదిరాక్షి, మీనాక్షి—ఇంతకు మించి ఎక్కువ అవకాశముండదు.

కాని బెళుకుచూపులు అన్నప్పుడు సమర్థుడు, అనుభవజ్ఞుడైన నర్తకుడెన్నో విధముల గంటలతరబడి అభినయించి రసికుల నానంద సాగరమున ముంచితేల్చగలడుకదా!

క్షేత్రయ్య నర్తకునియొక్క పాండిత్యమును ప్రదర్శించుట కవకాశము కల్పించుటకే ఇట్టి "నెరవు" నేర్పాటు చేసెనేమో!

పదములు పాడు విధానము :

సాధారణముగ పదములను పల్లవితో ప్రారంభించుట వాడుకలో నున్నది. కొన్ని అనుపల్లవితోను, మరికొన్ని చరణ మధ్యములోనుండి ప్రారంభించినగాని భావ స్ఫురితముగ నుండవు.

ఉదా :

ప॥ "ఏమని తెలుపుదు యేలాగు తాళుదు
యేమి చేతునే చెలియా!
అ॥ ప॥ ఖామరో యూరికి బయలుదేరెడువేళ
క్షేమ మీరగ నా సామి పిలిచి చెప్పిన మాట"

పై పదము అనుపల్లవితో ప్రారంభించిన మనకు వెంటనే అర్థమై ఆ రసమును అనుభవించగలము.

కొన్ని చరణము మధ్యనుండి మొదలుపెట్టినగాని సొంపుగ నుండవు.

ఉదా ;

ప॥ "ఎవరివల్ల దుడుకు మా యిద్దరిలో సకియ
అ॥ ప॥ వివరింపు మమ్మా! ఈ విధము
తెలిసి యిపుడు
చ॥ రమణి! బంగారు మంచముపై నిద్దరము చాల
మమతతో సరసంపు మాటలాడేవేళ
కమలాక్షి పేర నన్ను ఘనుడు పిల్వగా
కోప
శమనము లేక నా జడకొద్ది గొంటినమ్మా!"

ఇందు పల్లవి, అనుపల్లవితోగాక చరణములోని "కమలాక్షి పేర నన్ను" నుండి ప్రారంభించిన సొంపుగ నుండును.

ఎట్లన్న :

"కమలాక్షి పేర నన్ను ఘనుడు పిల్వగా కోప
శమనము లేక నాదు జడకొద్ది గొంటినమ్మా
వివరింపుమమ్మా! ఈ విధము తెలిసి యిపుడు"

ఇంతవరకు ఊరకపాడి "ఎవరివల్ల దుడుకు మాఇద్దరిలో సకియ" అనుచోటనుండి అభినయమందుకొన్న బహు ముచ్చటగా నుండును.

పదములలో రాగముల విలువ :

రాగములయొక్క పరిపూర్ణ స్వరూపము పదములయందు కనబడునట్లు మనకు మరియే యితర సంగీత రచనల యందును గోచరించదు. రాగము గంభీరత, భావము పదములలోని నాయికలలో ప్రత్యక్షముగ నృత్యమాడును. పదముల విలంబిత లయలో నుండుటచే ఆ రాగములోని అతిసున్నితమైన, మధురమైన ధ్వనులనుగూడా ఆ నాయిక యొక్క విరహమో, దుఃఖమో మరియే యితర సంచారి భావముల ద్వారానో ప్రదర్శించుటకు అనుకూలముగ నుండును.

పదములు కొన్ని ఆంగిక ప్రధానమైనవి, కొన్ని సాత్త్విక ప్రధానమైనవిగా నున్నవి.

సాత్త్విక ప్రధానమైన పదరచనలు :

ఉదా : ప॥ అక్కరో! యోర్వనివాడు సరసుడు
గాడని యాడుకొంటే ఆడుకోనేరు

అ॥ ప॥ మ్రొక్కదగినవాని, ముద్దు మాటల వాని
మువ్వ గోపాల సామిని యెవరైనగాని ॥అక్కరో॥

చ॥ రామ! వాని దలచినపుడే రవిక క్రిక్కిరిసి గుబ్బ
లేమో రోమమ్మెల్ల నిండునే వాని మాటలంటే
నా మనసు పై పై నుండునే యెవరైనగాని ॥అక్కరో॥

ఈ పదాభినయమందు సంచారుల యొక్క, ఆంగికముయొక్క అవసర మెక్కువగ నుండదు. సాత్విక భావము (స్తంభము, స్వేదము, రోమాంచము) మొదలైన వానిపై ఈ నాయిక అభినయ మాధార పడి యుండును.

'రామ వాని దలచి నపుడే' — ఇచ్చట అభినయము ఉఛ్వాస నిశ్వాసములతో ప్రారంభమైనను శరీరము యొక్క పొంగును ప్రదర్శించుటకు సాత్వికమే శరణ్యము. అట్లే పదమంతయు సాత్విక భావముల యొక్క ప్రదర్శనపై నాధారపడి యున్నది.

కేవలము సాత్విక సంచారుల యొక్క సహాయముతోనే ప్రదర్శించుటకు చక్కని అవకాశమున్న పదములు మరికొన్ని —

"ఎందు దాచుకొందు నిన్ను — ఏమిసేతు నేను ?
అందమైన నీమోము — అయ్యలూ! ముద్దు గుల్కుచున్నది"

ఈ పదములో "ఎందు దాచుకొందు నిన్ను" అన్నప్పటి ఆత్రుత, అసహాయత, కంగారు మొదలైనవి ప్రదర్శించినప్పుడు 'అందమైన నీమోము అయ్యలూ ముద్దుగుల్కు చున్నది' — ఇందు ప్రదర్శించునట్టి ఆనందమునకు ఆంగికము యొక్క అవసర మెంత మాత్ర ముండదు. ఆనందము ఆత్రుత కంగారు నేత్రముల యొక్క గతి ద్వారా ప్రదర్శించవచ్చును.

ఆంగిక ప్రధానమైన పదము

"ఏ తీరున రమణిని గెలిచినీ — వెట్ల రూపొందువో ?

చూతము రారా ! మదన ! నీ

చేత బలిమి మా చెలియ బలిమి ॥ఏ తీరున॥

రాతిరనే యేనుగ నెక్కి — రాకా చంద్రుడు గొడుగుగాను

లేత తెమ్మెర మొదలైన బలముల — చేత గెలిచెద నంటివా ?

పోతుటేనుగు కుంభములే—పొలతి గుబ్బలు మోనుచంద్రుడు

నాతి ప్రాణములె చలువ తెమ్మెర

జాతి వారిలో పగలు గలదా ! ॥ఏ తీరున॥

(ఇందు సాత్వికము కన్న ఆంగికాభినయమే (హస్తాభినయము) ప్రాధాన్యత వహించునని పదము చదివినంతనే తెలియుచున్నది.)

**పదములు - రాగములు**

కర్నాటక సంగీతములో కొన్ని వందల రాగము లున్నప్పటికీ క్షేత్రయ్య సుమారు నలభై రాగములకంటె ఎక్కువ రాగములలో పదరచన జేయలేదు. అతనికిమిగిలినరాగములురాకకాదు. పదములోని నాయిక, స్థాయి, సాత్వికసంచారులను వికసింపజేయుటకు సంగతులు వేసి పాడుటకు అనుకూలించునట్టి రక్తిరాగములనే ఏరుకున్నాడు. నాయికలు కొన్నివందలైనప్పటికీ, అష్టవిధ నాయిక లెట్లు ప్రాముఖ్యముతో పరిగణింప బడుచున్నారో అట్లే రాగములను గూడ అతడు ఏరుకొన్నాడు. అంతేగాక ఒక్కొక్క రాగము, దాని స్వర సంచారము ననుసరించి, భావసంచారమునకు అనువైనట్టి వాటియందే ఏరి కూర్చెను. కాని ప్రస్తుత కాలములో కొందరు రాగములను మార్చుట కద్దు. దీనివలన నాయికా స్వరూపమునకు భంగము కలుగును. సంచారీ వికాసమున కుపకరించదు. భాషకును, సంగీత పోకడకును అతుకు కుదరదు. కనుక వీలైనంత వరకు క్షేత్రయ్య రచన సల్పిన రాగముల యందే పాడుట ఉత్తమము.

ఉదా :

ఎటువంటి వాడే వాడు ! ఓ యమ్మ వాడు

ఎన్నడూ ఈ వీధిని రాడు

ఈ పదమును 'నీలాంబరి' లో రచించగా కొందరు కల్యాణిలో పాడుచున్నారు. ఈ పదములోని నాయికాభినయములో శృంగారము, అద్భుతము — రెండు రసములు పోషింపబడుటకుగాను క్షేత్రయ్య ముగింపు మాటలు, రాగము యొక్క ముగింపు ధ్వనికి సరిపోవునట్లు రచన జేసెను. 'డు', 'ట' ఈరెండు అక్షరములు ఆ రాగముయొక్క ముగింపులో కలిసి అంతమైనప్పుడు ఒక విధమైన ఆశ్చర్య రసోత్పత్తి తన్మయమూ కలుగును. కల్యాణిగాని మరే రాగములో పాడినను ఆ భావస్ఫురణ కలుగదు.

**పదములు - లయ, తాళములు**

పదముల విలంబిత లయలో పాడిననే అభినయము చక్కగా ప్రదర్శించుటకు అవకాశముండును. కొందరు లయపెంచి కీర్తనలపోకడలో పాడుచున్నారు. అది అభినయమునకు ఒప్పదు. మరి కొందరు కళాకారులు పదవర్ణములందువలె త్రికాలపుటడుగులు కూడ పట్టుచున్నారు. అడుగులు వర్ణములు, జావళీలందు ఒప్పును. అభినయమందు కేవలము తాళము గతి తెల్పుటకు మాత్రం అడుగులు ప్రదర్శింపబడును. నర్తకి తనకు కాలిలో గల పాండిత్యము జూపుటకు గాదు. ముఖములోని భావప్రకటనలో పాండిత్యము ముఖ్యముగా అభినయములో నర్తకి ప్రదర్శించవలెను. కాలి అడవు పాండిత్యము నృత్త, నృత్యాదులలో చూపవచ్చును.

కొందరు కళాకారులు తాళము లు మార్చి పాడుదురు.

ఉదా : "రమ్మనవే సముఖాన

రాయబారము లేలే"

ఈ పదము త్రిపుట తాళము, కేదార రాగములో నున్నది. దీనిని రూపక తాళములో గానము చేయుదురు.

అట్లే "మగువ తన కేళికా మందిరము వెడలెన్" అన్న పదము ఝంపెలో నుండగా, రూపకములో పాడుదురు.

తాళము లెక్కకు సరిపెట్టబడిననూ, నడకయొక్క యందము కుంటుపడును. కావలసిన భావగాంభీర్యము, నాయిక రూపకల్పన జరుగదు.

**పదములు - రాగమాలికలు**

పల్లవి, అనుపల్లవి ఒక రాగమందును, మిగిలిన మూడు చరణములును మూడు రాగములందును రాగ మాలికగా కొందరు విద్వాంసులు పాడుచున్నారు. కవి పల్లవి, అనుపల్లవిలో నాయికను నిరూపించి మిగిలిన చరణములలో ఆమె పూర్తి అవస్థలను తెల్పును. పదమును పూర్తిగ పాడినగాని ఆ నాయిక, ఆమె అవస్థాభేదములు తెలియవు. అట్టితరి రాగముల మార్పు భావపోషణకు ఆటంకముగా నుండును. ఒక రాగములోని వివిధ భావముల పోషణకుకు రాగము సంచారముజేసి పాడుట ఉత్తమ అభినయమును ప్రకటించుట కుపకరించును.

1. నాయిక భావము నభినయించుట 2. నాయికతానై అభినయించుట. ఈ రెండు విధములైన అభినయములలో 2 వ పద్ధతి అభినయమే శ్రేష్ఠమైనది. ఎంతో సంస్కారవంతులకుగాని అట్టి అభిన

యము పట్టువడదు. అదియే నిజమైన కళ. అట్టి కళాకరులే సభకు సంపూర్ణమైన రసాస్వాదన కలిగించగలరు. మొదటి తరగతి అభినయము సాధనవల్ల అలవడును. అది అర్ధాభినయము మాత్రమగును. తానే నాయికయై అభినయించునట్టి విద్యయందు శాస్త్రమును తెలియుటయేగాక అభినయించు పాత్ర యొక్క భావముల ననుభవించుచు, ఇతరులకు ఆ రసభావములను పంచును. కాన సంపూర్ణ నాయికా స్వరూప నిరూపణ జేయగలదు. దేశములోని ఉత్తములైన అభినయ కళావేత్త లందరూ ఈ తరగతికి జెందిన వారే.

# పదాభినయము—వ్యాఖ్యానము

ఈ గ్రంథములో వ్యాఖ్యానం వ్రాసిన పదాలకు అభినయం మా గురువుగారు శ్రీమతి రాజమ్మగారి వద్ద నేను అభ్యసించి, అభినయించి నట్టిది.

క్షేత్రయ్య పదాలపై వ్యాఖ్యానము వ్రాస్తున్న పది సంవత్సరాల కాలంలో ముఖ్యంగా అభినయ విద్యపైని ప్రముఖులైన కళావేత్తల అభిప్రాయములను తెలిసికొనుటకు ఆంధ్ర, తమిళ, కర్నాటక ప్రాంతాల్లోని పెద్దల నెందరినో కలిసినాను. కొందరి అభినయం చూచే అవకాశం లభించినది. కొందరి పాట వినే అదృష్టము కలిగినది. కొందరితో శాస్త్ర చర్చ జరిపే భాగ్యం కల్గినది. అందువల్ల మా గురువుల వద్ద అభ్యసించిన విద్యనూ, వివిధ సంప్రదాయాలకు చెందిన కళావేత్తల విద్యనూ చూచి, తెలిసికొన్నట్టి అపూర్వ విషయాలు, ఈ గ్రంథంలో పొందుపరిచే అవకాశం లభ్యమయినది.

ఆంధ్రదేశంలో నేను దర్శించిన కొందరు ప్రముఖ కళావేత్తలు, పండితులు.

శ్రీయుతులు చల్లా భరతశాస్త్రం లక్ష్మీనారాయణ గారు, కోట్లకొండ; వేదాంతం లక్ష్మీనారాయణశాస్త్రిగారు, కూచిపూడి;

అల్లంరాజు సుందరంగారు, పిఠాపురము; డా. గిడుగుసీతాపతిగారు, హైదరాబాద్.

శ్రీమతులు జీవరత్నమ్మ, బొబ్బిలి; రాముడు, విజయ నగరం; గంధం లక్ష్మీకాంతమ్మ, మాడుగుల; చంద్రవదన, తుని; పెండేల సత్యభామ, పిఠాపురము; జక్కుల నూకరాజు, పిఠాపురము; దువ్వా అమ్మాణీ, పిఠాపురము; పందిరి వేంకటరత్నం, మండపేట; కోటిపల్లి సుబ్రహ్మణ్యాం, మురమండ; అన్నాబత్తుల బులివేంకట రత్నం, ముమ్మిడివరం; చిత్తజల్లు చినవేంకటరత్నం, పెద వేంకట రత్నం, వైదేహి, ఇందువదన, మారంపల్లి; చదలవాడ సామ్రాజ్యం, ఏలూరు; ఎల్లాసాని, కర్నూలు; అల్లుపల్ల వపాణి; వాడపల్లి; యండ మూరి రామం, కాకినాడ; చూడామణి, చాటపర్రు; దుగ్గిరాల జగదాంబ, మండపేట; షేర్ వెల్లాల లక్ష్మీకాంతమ్మ, ప్రొద్దుటూరు; నట్టువ ఇందిరాదేవి, కోవెలకుంట్ల; జి. నాగమణమ్మ, నెల్లూరు; సరిదె మాణిక్యం, దువ్వ; అన్నాబత్తుల సూర్యకాంతం, అమలాపురం; మద్దుల లక్ష్మీనారాయణ, ఇందుపల్లి మొదలైనవారు.

**తమిళ దేశంలో నేను కలిసిన ప్రముఖులు :**

శ్రీమతులు మైలారు గౌరీదేవి, తంజావూరు బాలసరస్వతి; పక్షితీర్థం జీవమ్మ.

శ్రీయుతులు పందనల్లూరు మీనాక్షి సుందరంపిళ్లై, పందనల్లూరు చొక్కలింగం పిళ్లై, చంద్రశేఖరపిళ్లై (వీరు బొంబాయిలో వుంటున్నారు), తిరువెంకటాచారి, చెయ్యూరు.

**కర్ణాటక దేశంలోని కళారాధకులు :**

శ్రీమతులు మైసూరు జేజమ్మ, మైసూరు వేంకటలక్ష్మమ్మ, నంజన్‌గూడి నాగరత్నమ్మ, బ్రహ్మవరు గులాబీబాయి, శ్రీ బెంగళూరు గుండప్ప.

వీరందరూ నృత్యం, అభినయకళల్లో ప్రసిద్ధులు. వీరుగాక ఇంకనూ మరెందరో కళాకారులను కలిసి యున్నాను.

పదములను అభినయమునకు అనుకూలించు రీతిని భావ యుక్తంగా పాడేవారిలో ఆంధ్రదేశంలో ప్రఖ్యాతి గాంచినవారు, గానకళా ప్రపూర్ణులు శ్రీ పర్వతనేని వీరయ్య చౌదరిగారు, వీరితో కలిసి ఒక సంవత్సరకాలము, 40 క్షేత్రయ్య పదాలను వారి పాటతో అభినయం సాధన చేయించారు శ్రీ విస్సా అప్పారావుగారు, "అభినయ స్వయంబోధిని" అనే గ్రంథము గూడా నాకు చాలా ఉపయోగపడింది.

నే నెరిగినంతవరకు ఆంధ్ర, కర్నాటక ప్రాంతాల్లోని కళాకారులు శాస్త్రము, సంప్రదాయము ఈ రెండింటికీ ప్రాముఖ్యత నిచ్చి అభినయించుచున్నారు. తమిళనాడులో సంప్రదాయానికి విలువ నిస్తారు. తెలుగుభాషయొక్క ఉచ్చారణ తమిళదేశంలో కంటే కర్నాటక ప్రాంతీయుల పాటలో చక్కగవుంది. దాక్షిణాత్యులేగాక ఉత్తరదేశంలోని కొందరు అభినయ కళావేత్తలను కలిసికొన్నాను. అట్టివారిలో ముఖ్యులు శ్రీమతి ఎల్లూబాయి, పూనా; శ్రీ శుఖదేవకథక్, బనారసు. శ్రీమతి ఎల్లూంబాయి పూనా నగరానికి చెందిన ప్రఖ్యాత అభినయ కళావేత్త, మరాఠీ, హిందీ భాషల్లోవున్న శృంగార రచనలు టుమ్రీ, టప్పా, గౌలన్ యిత్యాదులను అభినయించేవారు. భాష వేరై సంగీతబాణీ మారినా, ఆ పాటలకు అభినయము మన పదాభినయాన్ని పోలివుంటుంది.

శ్రీ శుఖదేవకథక్ :- వీరు కథక్ నర్తనమే గాక అభినయం గూడా చేసేవారు. కాని ఈ బాణీలు "దేశి" సంప్రదాయమునకు చెందినట్టివి.

ప్రఖ్యాత టుమ్రీ, టప్పా, కజరీ గాయకీమణుల సంగీతం వినే అవకాశం నాకు ఉత్తర హిందుస్థానంలో లభించినది. ఈ పాట లన్నీ పదాలవలే శృంగారరస భరితములై, నాయికా నాయకుల విరహ వియోగాలను వర్ణించునట్టి రచనలే. ఈ గీతాలను పాడుటలో ప్రసిద్ధులు— శ్రీమతి సిద్ధేశ్వరిదేవి, గిరిజాదేవి, రసులన్ బాయి, అక్తారు బాయి. వీరి పాట వింటే మన దేశంలో అభినయించేటప్పుడు నర్తకీ మణులు పాడేపాట, అందులో ఆయా సంచారీ భావాలను ఒప్పించు నప్పుడు వేసే సంగతులు, గాత్రములో పొందికా యివన్నీ తలపింప చేస్తాయి.

నేను నాగపూరులో వుండగా శ్రీమతి చంపాబాయి అనే ప్రఖ్యాత టుమ్రీ గాయకీ మణితో ఒక నాట్యప్రదర్శనములో కలిసే అవకాశమేర్పడింది. ఆమె నాయొక్క అభినయంచూచి చాలా సంతో షించింది. అప్పటినుండి ఆమెను తరుచు కలిసుకొనేవాణ్ణి. ఆమె తరుచూ కచ్చేరీలు చేసేది. సుమారు మూడు సంవత్సరాల కాలము ఒక వందవరకూ ఆమె పాడిన టుమ్రీలు విన్నాను. సభల్లో పాడుటయే గాక ఆమె సాధన చేసేటప్పుడు గూడా వినే అవకాశం లభించింది. ఆ పాట వింటుంటే, అభినయమే అవసరం లేదన్నంత ఉత్తమ స్థాయిలో భావమొప్పిస్తూ, ఆ గాన ముండేది.

ఈ కళారాధకుల విద్యను దర్శించుటవల్ల, యెన్నో అభినయ పొందికలు, గాత్ర విశేషములు తెలిసికొన్నాను. మరియు విషయ మొక్కటియే చెప్పవలసి వచ్చిననూ, ప్రాంతీయుల వల్ల ఆ చెప్పే తీరుల్లో ఆంగికంలోవుండే మార్పులు గుర్తించగల్గినాను. ఈ ఆంగికం మార్పుల వల్లనే వివిధ సంప్రదాయాలు ఏర్పడుచున్నవి, సాత్విక ప్రదర్శనమందు మాత్రము భేదములేదు.

క్షేత్రయ్య పదములపై వ్యాఖ్యానముతో ఆ పదముల నభినయించిన ప్రఖ్యాత కళాకారులూ, వారభినయించిన తీరులూ, వారి అనుభూతులూ, అభిప్రాయాలూ, శాస్త్ర విషయాల గురించి చర్చించిన తీరులూ, కళాకారుల ఉపయోగార్థమై యిందులో జతపరిచి లిఖించుచున్నాను.

పదముల సాహిత్యము : కొందరు కళాకారులు, కొన్ని మార్పులతో గానము చేయుచున్నారు. నేను యిందలి సాహిత్యానికి శ్రీ విస్సా అప్పారావుగారు ప్రచురించిన "క్షేత్రయ్య పదములు" గ్రంథాన్ని ఆధారముగా తీసుకొన్నాను. క్షేత్రయ్య రచన చేసిన మొదటి పదము "శ్రీపతి సుతుబారికి" – తో యీ వ్యాఖ్యానం ప్రారంభించుచున్నాను.

ఈ పదము యొక్క క్రమమునకు, ఇతర పదములకు భేదముంది. క్షేత్రయ్య రచించిన అన్ని పదములన్నింటియందూ పల్లవి, అనుపల్లవి, చరణముల క్రమమున్నది. గాని ఈ పదమొక్కటియందు మాత్రము ఆ క్రమము ననుసరించలేదు.

ఈ పదమును మా గురువుగారు అభినయించగా మొదటి సారిగా చూచియున్నాను. ఈ పదము యెక్కువగా ప్రచారంలో ఉన్నట్లు కన్పించదు. నేను ప్రత్యేకంగా పదములను సాధనచేసిన కాలంలో శ్రీ పర్వతనేని వీరయ్యా చౌదరిగారు గానము చేయగా, కొన్ని నెలలు ఈ పదాభినయాన్ని సాధనచేసే అవకాశం కల్గింది. ఒక పర్యాయం నేను తుని వెళ్ళినప్పుడు శ్రీమతి చంద్రవదన గారిని ఈ పదము అభినయించవలెననికోరగా నన్ను పాడమని ఆమె ఈ పదములోని ఒకొక్కక్క చరణానికి ఒకొక్కక్క సంచారి భావానికి ప్రాధాన్యత నిచ్చి అభినయించినది. నేను సాధనచేసిన క్రమముగూడా అట్టిదే. ఆ పద్ధతినను సరించే యిందులో అభినయము వ్రాసియున్నాను.

# శ్రీపతి సుతుబారికి ...

రాగము - ఆనందభైరవి, తాళము - ఆదితాళము

నాయిక - పరకీయ; శృంగార, కరుణ రసములు.

సంచారులు - మోహాము, హర్షము, దైన్యము,
ఔత్సుక్యము, నిర్వేదము, ఖేదము, ఆవేగము,
అమర్షము, అసూయ, వితర్కము, రోషము.

1. శ్రీపతి సుతుబారికి నే-నోపలేక నిను వేడితే
కోపాలా? - మువ్వగోపాలా! ॥ శ్రీపతి॥

2. ఏ పొద్దు దానింటిలోనే - కాపైయుండి నీ సరస స
ల్లాపాలా? మువ్వగోపాలా! ॥ శ్రీపతి ॥

3. పైపూత మాటలనేర్పు - జూపుదాని రతిపై నింత
తీపేలా? మువ్వగోపాలా ! ॥ శ్రీపతి ॥

4. చూపుల నన్యులదేరి - జూడని నాతో లేని క
లాపాలా? - మువ్వగోపాలా! ॥ శ్రీపతి ॥

5. నా పొందెల్లా దానికబ్బె-యే పొందు లేక యుసురను చే-
నాపాలా? మువ్వగోపాలా ! ॥ శ్రీపతి ॥

ఈ పదములో ఒక్కొక్క చరణములో ఒక్కొక్క సంచారి భావమునకు ప్రాముఖ్యము నిచ్చి అభినయించిన చూడ ముచ్చటగా నుండును.

### అభినయము

| | | | |
|---|---|---|---|
| శ్రీపతి | సుతు | బారికి నే | నోపలేక |
| **మోహము** | **హర్షము** | **దైన్యము** | **ఔత్సుక్యము** |
| | **నిర్వేదము** | | |
| | **ఆవేగము** | | |
| నిను వేడితే | | కోపాలా | మువ్వగోపాలా ! |
| **దైన్యము** | | **ఆవేగము** | **ఖేదము** |

ఈ పదములో దైన్యమునకు ప్రాధాన్యము. సాత్వికాభినయము.

**1. మోహము :** వియోగము, సంతోషముతో కూడిన బాధ చేత సొమ్మసిల్లుట లేక హృదయము ఆందోళన చెందుట, నిమీలిత నేత్రములు, మెరయుచున్న నేత్రములు, శరీరము కంపించుట, చెమర్చుట, అధరము వణకుట, శరీరము మరచుట, కన్నులు మూత పడుట, క్రిందికి ఒరగుట, చేష్టలు లేకుండుట.

**2. హర్షము, ముదము :** ముఖము, నేత్రము లందు వికాసము, శరీరము పొంగుట, శరీరము గరిపొడుచుట, పులకరింపు.

**3. దైన్యము :** ముఖమందు, నేత్రములందు వికాసము, శరీరము కుంచించుకొనుట, వేడుకొనుట, అశ్రుపూరిత నేత్రములు

4. **ఔత్సుక్యము** : నిమిషమాత్రము కూడ ఓర్వలేక త్వర పడుట, కోరిన వస్తువు లభింపక క్షణమైన తాళలేకపోవుట, మన్మథ తాపము,నిట్టూర్పు, మనస్సు కాక చెందుట, తాళలేకపోవుట, తొందర పాటు, వేగముగ నడచుట, శయనించుట యందభిలాష, పడకనుండి లేచుట,శరీరము బరువెక్కుట, చింతించుట.

5. **నిర్వేదము** : కన్నీటి నడ్డగించుట.

6 **ఆవేగము (అగ్న్యావేగము)** : విసరుకొనుట, చెమట బిందువులు తుడుచుకొనుట, నేత్ర సంకోచము, వ్యత్యాసముగ అడుగులు వేయుట.

7. **ఖేదము** : చేతులు పిసుకుకొనుచు ఇటునటు తిరుగుట, ముఖము విచారము పొందినట్లు కనబర్చుట, చింత, భ్రమను పొందుట.

ఆంగికాభినయము

(శ్రీ)పతి సుతుబారికి

1. అలరు విల్తుడు
2. కమ్మవిల్తుడు
3. రాచిల్క నెక్కేడు రాయరౌతు
4. మీనకేతనుడు
5. మకరకేతనుడు
6. చందమామ యల్లుడు
7. వలరాజు
8. అంగహీనుడు
9. లచ్చికొమరుడు (లక్ష్మిపుత్రుడు)
10. జమిలి ముక్కాలి నారివిలుకాడు

**1. అలరువిల్తుడు** : కుడిచేత అర్ధపతాకము పట్టి, తరువాత బాణహస్తము పట్టి పిమ్మట కుడిచేత శుక తుండముతో బాణము సంధించినట్లు పట్టవలెను.

**2. కమ్మవిల్తుడు** : కుడిఎడమల శిఖరములు పట్టి, ఒకదానిపై నొకటి మోపి బాణహస్తము పట్టవలెను. కుడిచేత శిఖరము, ఎడమ చేత శుక తుండము పట్టిన బాణహస్తము లేక మన్మథ హస్తమునకు ఒప్పును.

**3 రాచిల్కనెక్కెడు రాయరౌతు** : ఎడమచేత రాచిలుక, కుడిచేత శిఖరము దానిపై నుంచవలెను. రాచిలుక: తామ్రచూడ పట్టి, అందు చిటికెనవ్రేలు చాచిపట్టిన రాచిలుకకు చెల్లును.

**4. మీనకేతనుడు** : పతాకము కుడిచేతబట్టి, తరువాత మత్స్య హస్తము పట్టవలెను.

**5 మకర కేతనుడు** : పతాకములను స్వస్థికముగ పట్టవలెను.

**6. చందమామ యల్లుడు** : అర్ధచంద్ర హస్తముపట్టి, ఎడమ చేత అర్ధచంద్ర, కుడిచేత సందంశముపట్టి, మరల కుడిచేత శిఖరము పట్టవలెను.

**7. వలరాజు** : త్రిపతాకముపట్టి, కుడిచేత శిఖరము పట్ట వలెను.

**8. అంగహీనుడు** : రెండుచేతులందు అలపద్మములు పట్టి శరీరము వద్దనుండి క్రిందికి లాగి, కుడిచేత కర్తరీ ముఖమును పట్ట వలెను.

**9. లచ్చికొమరుడు** : రెండుచేతులందు అలపద్మములు పట్టి ఇరు పార్శ్వములందు కపిత్థములు పట్టి మాతృహస్తము పట్టవలెను.

**10. జమిలిముక్కాలినారి విలుకాడు :** కుడిచేత భ్రమర హస్తము పట్టి, ఎడమచేత శిఖరము విల్లునారి చూపవలెను.

మన్మథ పంచబాణ ప్రయోగస్థలములు

| బాణము | ఆంగికము | సాత్వికము |
|---|---|---|
| 1. అరవిందము | స్తనములు | ఉన్మాదము |
| 2. అశోకము | అధరము | రోదనము |
| 3. చూతము | శిరము | సమ్మోహము |
| 4. నవమల్లిక | నేత్రములు | దేహము శుష్కించుట |
| 5. నీలోత్పలము | గుహ్యము | మృతి |

(నీలోత్పలము నభినయించకూడదు. మూర్ఛ వరకభినయించి బాణము సంధించక యూరకుండ వలెను)

**శ్రీపతి సుతుబారికి :**

బాణహస్తము పట్టి సంధించి తరువాత రెండు చేతులందు కటకాముఖ హస్తములు పట్టి, వాని హృదయము వద్దకు తెచ్చిన బాణము తగిలినట్లు భావము. అటుపై చేతులు అలపద్మములు అర చేతులు చేర్చి పట్టి వ్రేళ్లు వణికించిన 'నేనోపలేక' అనుటకు చెల్లును.

'నినువేడితే' — రెండుచేతులందు ముకుళములు పట్టి, కుడి ప్రక్కకుగాని, ఎడమప్రక్కకుగాని పొడిగించి, జాలిచూపుల చూచుచు ఆ హస్తము వికసింపజేయవలెను.

"కోపాలా" — సాత్విక సహాయముతో.

"మువ్వ" — ఎడమచేత హృదయమున కెదురుగ అలపద్మము పట్టి కుడిచేత సూచీ ముఖముపట్టి, తలపైకి చేయినెత్తి కొంచెముగ త్రిప్పిన ఊరునకు జెల్లును.

"గోపాలా !"—వేణువు జూపవచ్చును. లేక ఎడమచేత సింహ ముఖము, కుడిచేత సూచి గోవులను తోలునట్లు పట్టవలెను.

| | | |
|---|---|---|
| 2. ఏ పొద్దు | దానింటిలోనే | కాపై యుండి |
| **అమర్షము** | **అసూయ** | **ఉగ్రత** |
| నీ సరస | సల్లాపాలా ? | మువ్వగోపాలా ! |
| **వితర్కము** | | |

(ఇందు అసూయకు ప్రాముఖ్యము)

అమర్షము (రోషము): చింతించుట, చెమర్చుట, శిరః కంపం, తలవంచుట, తర్జన భర్జన.

అసూయ మోము త్రిప్పుకొనుట, కనుబొమలు, ముఖము లేక నొసలు చిట్లించుట, అధికకోపము చేతగాని ఓర్వలేక గాని నిస్సహాయత్వము వల్లగాని కంటతడిపెట్టుట.

ఉగ్రత : కనులెఱ్ఱబడుట.

వితర్కము : కనుబొమల నెత్తుట, ఎగురవేయుట, తల ముందుకు ఆడించుట, ఆలోచించు చున్నట్లు కనబరచుట.

సరస సల్లాపాలు : కులుకు గుబ్బలు చూపుమని కులుకుట, తలయూచి నవ్వుట, తాళజాలనని వేడుట, వలరాజుపై పదము పాడుకొనుట, నినుజూసి కంటికి నిదురరాదనుట, నిముసమైన గాని ప్రొద్దుపోకపోవుట, మరుబారికోర్వలేకపోవుట, కామశాస్త్రము చదివి కథలు చెప్పుమనుట.

## ఆంగికము

"ఏ పొద్దు" — కుడిచేతి పతాకము ముఖము ముందునుండి క్రిందికి తీసికొని రావలెను.

"దాని" — మెటికలు విరుచుభావము.

"ఇంటిలోన" — రెండుచేతులందు పతాకము తలపై చేర్చి గోపురాకారముగ పట్టవలెను.

"కాపై యుండి"-మృగశీర్షము ముఖముముందునుండి క్రిందికి తీసికొని రావలెను.

"నీ సరస సల్లాపాలం"-కుడిచేత అలపద్మముపట్టి తలను, చేతిని ప్రక్కల కాడించుచు అడిగినట్లు గడ్డముక్రింద యెడమచేయినుంచి బొమముడి, ఎడమచేయి నడుముపైనుంచి, కుడిచేయి జారవిడిచి తల ముందు వెనుకలకు ఆడించుట.

సరస సల్లాపాలు :- 1. సోలపద్మముకాని, ముకుళముకాని పట్టి, తరువాత కుడిచేత చతురములోని చిటికెనవ్రేలితో కంటినిజూపి ; పిమ్మట ముకుళమును వికసింపజేసి వేడికొనుట కనబరచవలెను. 2. తలయూచి నవ్వుట 3. రెండుచేతులందు పతాకముల వికసింప జేసి హృదయమున కెదురుగ కదలించుట, శరీరము కంపించుట. 4. చిలుక వాహనుని చూపి వీణ మీటుటగాని, మురళి నూదుటగాని జూపవలెను. 5. సూచీతో చూపి, తరువాత కర్తరీ ముఖహస్తమును చూపి, చతుర హస్తములోని చిటికెనవ్రేలితో నేత్రములను జూపి, ఎడమచేత పతాకము చెంపకానించి, నిద్ర నభిన యించి పతాకముతోను ముఖమున కెదురుగ విప్పారిన నేత్రములు, అడ్డముగ తల కదలించుచు ప్రక్కలకాడించవలెను. 6. చిటికవేసి పతాకను పట్టవలెను. 7. బాణహస్తము, బాణముల సంధించుట చూపి, శరీరము కంపింపజేయుట. 8. వలరాజు హస్తముపట్టి, రెండు పతాకములు చేర్చి, అడ్డముగపట్టి, తాళపత్రము చదువు చున్నట్లభినయించి, కుడిచేత హంసాస్యము పట్టవలెను.

| | | |
|---|---|---|
| 3. పై పూత మాటలనేర్పు | జూపు దాని | రతిపై |
| **అమర్షము** | **ఉగ్రత** | **రతులు** |
| ఇంత తీపేలా ? | మువ్వగోపాలా ! | |
| **అసూయ** | **వితర్కము** | |

(ఇందు వితర్కము ప్రధానము)

**ఆంగికము**

'పై పూత మాటలనేర్పు'-ఎడమచేత ముకుళముపట్టి, కుడిచేత చతురముతో దానిపై వ్రాసినట్లభినయించి, తరువాత కటకాముఖమును నాభివద్దనుండినోటివద్దకు తెచ్చి, అటుపై కుడిచేత శిఖరము పట్టవలెను.

'చూపు' — దృష్టి భేదములు

'రతిపై' — రతులు

1. ఎడమచేత పతాకముపట్టి, చెక్కిళ్ళకు తగులునట్లుంచి కుడిచేయి జారవిడిచి నడక నభినయించి, కుడిచేత కర్తరీ ముఖములో చూపుడు, నడిమివ్రేళ్లు కలుపవలెను. 2. ఖట్వాహస్తముపట్టి, కుడిచేత పట్టబడిన అర్థపతాక చూపుడు, నడిమివ్రేళ్లమధ్యలో ఎడమచేతి అర్థపతాక వ్రేళ్లను జొప్పించవలెను. 3. రెండు సర్పశీర్షములు స్వస్తికాకారముగ పట్టి కర్కటహస్తము పట్టవలెను. 4. రెండు చేతులందు శిఖరములు స్వస్తికాకారముగా పట్టి పాశహస్తము పట్టవలెను.

ఇటుల సమయానుకూలముగ హస్తముల నేర్పరచుకొని అభినయించవలెను.

'ఇంత' — పతాకము

'తీపేలా' — శిఖరముపట్టి ముందు వెనుకలకు పావురాయివలె తల నాడించుట,

4. చూపుల అన్యుల తేరిజూడని నాతో లేని
గర్వము ఖేదము
కలాపాలా? మువ్వగోపాలా!
రోషము
(ఇందు ఖేదమునకు ప్రాముఖ్యము)
గర్వము
చూడక యుండుట
తన అవయవములను ఒయ్యారముగ చూచుకొనుట
మోము త్రిప్పుకొనుట
నిర్లక్ష్యము

**ఖేదము**

ఉత్సాహము లేక యుండుట
మిక్కిలి చింతించుట
తలయెత్తి చూడకుండుట
జాలి చూపు, అశ్రుపూరిత నేత్రములు
'కలాపాలా' —
వేడుకతో ఆకు మడుపు విసురుట
పలుగాట్లు మోవిపై నుంచుట
సందుగొని మరుకేళి సలుపుట
కొదమ గుబ్బలమీద క్రొన్నెల లుంచుట
కౌగిట జేర్చుకొనుట
ముంగురులు చేతదువ్వి నొసలు, కళ్ళు ముద్దిడుట
ఉరముపై నుంచుకొనుట
చౌశీతి రతుల నేలుట
పుక్కిటి విడెమిచ్చి, చెక్కిలినొక్కి, కళలంటి
మోవి తేనె చప్పరించుట

రొమ్మున గుబ్బలాన్చి ముద్దుపెట్టుకొనుట, ఇదిగోయని ఆకుమడుపులిచ్చుట, తిలకము అందముగ నొసట దిద్దుట, బలిమి సుగంధము, పన్నీరు మర్దించి బాగుగ అలదుట, చెక్కిళ్లు కొసరి కొసరి ముద్దాడుట, మోమున మోము జేర్చి మోవితేనె పీల్చుట, బంగారు తూగుటుయ్యాలలో నూగుట - వీనిని క్షేత్రయ్య తన పదములో పేర్కొనెను.

| | | | |
|---|---|---|---|
| 5. నా | పొందెల్ల | దానికబ్బియే | పొందు లేక ఉసురనుట |
| ఖేనము | అమర్షము | అసూయ | నిర్వేదము |

నాపాలా ? మువ్వ గోపాలా !

( ఇందు దైన్యము, వితర్కము, ఖేదము, అసూయ, నిర్వేదము - అయిదింటిని విజృంభించి అభినయించి ముగించవలెను.)

# "ఎందు దాచుకొందు నిన్ను"

**కళ్యాణిరాగము - ఝంపె తాళము**

ప. ఎందు దాచుకొందు నిన్ను
నేమిసేతు నేను ?

అ. అందమైన నీ మోము
అయ్యాలూ ! ముద్దుగుల్కుచున్నది.

చ. అందిందు దిరుగకుర అతివలు నీతోడి
పొందుగోరి యేవేళ పొగరుచున్నారు
యెంద రెందరని కాతు యెంతని నే విన్నవింతు ?
పందెమాడుకొన్నారట పట్టుకబోయెదమనుచు ॥
పలుమారు నాసామి బయలు వెళ్ళకు మ్రొక్కె
నిలువరాని మోహమున నిను జూచి చెలులు
అలరు నీ మోవి తేనె, యాని చప్పరించవలసి
కులుకు గుబ్బల రొమ్ము గుమ్మి పొయ్యాదరనుచు ॥
ముదముతో మా ముద్దు మువ్వగోపాల నాసామి
గుదిగొన్న తమకమున గూడి యిద్దరము

నిదుర పరవశమున వదలునో కౌగిళ్ళ
పదిలముగ నా జడనుబట్టి కట్టుకొందునా ॥

**కళ్యాణిరాగము - ఝంపె తాళము**

నాయిక - స్వీయ, ప్రగల్భ, స్వాధీనపతిక
నాయకుడు - అనుకూలుడు
శృంగార రసము, సంభోగశృంగారము

సంచారి భావములు :—

శంక, వితర్కము, విషాదము, దైన్యము, అమర్షము, ఈర్ష్య, మోహము, ఔత్సుక్యము, ఉగ్రత, సుప్తి, మోహము, హర్షము.

ప. ఎందు దాచుకొందు నిన్ను —
వితర్కం దైన్యం
ఏమి సేతు నేను ?
దైన్యం, వితర్కం

వితర్కంలో కనుబొమలు ఎగరవేయుట, బొమముడి, కనుబొమల పైకెత్తుట, ఆలోచించుచున్నట్లు కనబర్చుట—ఇదెట్లనగా తలను పైకెత్తి, దృక్కు పైకి సారించి నిశ్చలత్వము కనబర్చుట, తలను క్రిందికిదించి గడ్డముక్రింద చేయినుంచి,ఆలోచన నభినయించుట ఇందు దృక్కుల చంచలత్వం లేక ఏకాగ్రత కల్గియుండవలెను.

దైన్యము — మనస్సు వ్యాకులత చెందుట, దైన్యము. ఈ భావము యిచ్చట పట్టవలెను.

నేత్రములందు జాలిగొల్పు విన్యాసము.
అతిశయము నణుచుకొని పేదరికము కనబర్చుట

తత్తరపాటుతో కూడిన చిత్తచాపల్యము
శరీరమును కుంచుకొనుట
ఏమీ తోచక స్తంభించిపోవుట
నిరుత్సాహపడుట
అందమైన నీ మోము - అయ్యాలూ !
**హర్షం** (ముదము)
ముద్దుగుల్కుచున్నది
ఔత్సుక్యం, హర్షం

హర్షః :

ముఖమందు, నేత్రములందు కాంతి ప్రదర్శించవలెను. పులకరింతలు.

స్వేదము :

శరీరము పుష్పాంగిపోవుట. ఇవి శరీరముపై కనబర్చే ఉత్సాహ చిహ్నములు - అందు నేత్రములోగూడ ఈ మార్పులకు అనువైన తల కంఠమును మలిచి పాడవలెను.

అందమైన నీమోము : అన్నప్పుడు అందమైన కనుబొమలు, నేత్రములు, దృక్కులు, ముక్కు, పెదవులు, చెక్కిళ్లు, పలువరుస, యిత్యాదులు అభినయించుట ఆంగికము. అది శాస్త్రములందు వర్ణించిన పురుష సౌందర్య పద్ధతిని బట్టి హస్తములు (ముద్రలు) పట్టి ముగింతుము. అది సామాన్యముగా నర్తకులందరూ పట్టే విధము. అట్లు గాక.

అందమైన నీ మోము : ఆ సౌందర్యవంతమైన కృష్ణ దేవుని ముఖపద్మమును దర్శించినప్పుడు ఆ నాయిక హృదయం పొందే ఆనందానుభూతి ప్రదర్శించుట సాత్వికము. ఈ సాత్వికము హర్షము

ద్వారా ప్రదర్శింతుము. హర్షమును ప్రదర్శించుటకు అలంకారికులు కొన్ని విధానాలను శాస్త్రాల్లో సూచించారు. ఆ విధానాలు కేవలము మార్గమును మాత్రము సూచించును. ఆ మార్గాల ననుస రించి సమర్థులైన నర్తకులు ఎన్నోవిధాల ఆ భావాన్ని వికసింప జేయుచున్నారు. ఆ రీతుల నభినయించునప్పుడు ఒకే సంచారి భావంలో అనేక సంచారుల ఛాయలు మనకు గోచరమగును.

ఉదాహరణ : అందమైన నీ మోము - అని పాడుతూ.

నేత్రములందు కాంతి

నేత్రములందు ఆనందాశ్రువులు ప్రదర్శించుట తన్మయీ భావాన్ని సూచించును.

స్తంభము ప్రదర్శించుట : హర్షమునందు రాకపోయిననూ సాత్వికభావముగా అభినయము చెల్లును. తలను పైకి, క్రిందికి కంపించుతూ, కుడిచేత ముద్రాహస్తముతో ముగించుట. నిశ్శంకను మఱియు తలను యిరు ప్రక్కలకు ఆడిస్తూ హంసాస్యముతో ప్రారంభించి, అలపద్మముతో ఆ హస్తమును ముఖంచుట్టూ త్రిప్పి ముగించుట. ఉత్సాహాన్ని ప్రదర్శింపజేయును. కాని ఈ రెండునూ హర్షంలోని భాగములు కాకపోయినా, ఆనందాతిశయముతో కూడిన ఉత్సాహాన్ని ప్రదర్శించుటకు అనుకూలించుచున్నవి కనుక కళాకారులు యిట్టి భావాలను చేర్చి అభినయం పట్టుదురు. ఇది మనోధర్మానికి చెందినట్టిదిగా పేర్కొనవచ్చు.

అయ్యాలూ :

నాయకుని సంబోధించుట :

ఇందు వివిధరకములైన తలయొక్క కదలికలు (ప్రక్కలకూ, క్రిందికి మీదికి మొదలైన విన్యాసములు) రెప్పల నార్చుట, పెదవుల కదలికల ద్వారా సాత్విక వికాసము కలుగుచున్నది.

ముద్దు గుల్కుచున్నది
ఔత్సుక్యం, హర్షం

ఔత్సుక్యం: జాగును తాళలేకపోవుట ఉత్సాహములో ప్రదర్శితమగును. ఏమియు తోచక యిటునటు దిక్కులుచూచుట, తనలో తాను తర్కించుకొనుట, శరీరము బరువగుట, నిశ్వాసలు ప్రదర్శించుట, మనస్సులో నిశ్చలత లేకుండుట, చింత నొందుట మొదలైనవన్ని ఈ ఔత్సుక్యములో ప్రదర్శించవలెను.

"వితర్కం" తో ప్రారంభమైన పల్లవి. "ఔత్సుక్యం" చే వికసింపచేసి "దైన్యం" తో ముగింపచేయుటవల్ల సాత్వికము సంపూర్ణముగా వికసించుటయేగాక పరాకాష్ఠనందుచున్నది. వితర్కమందు ఉత్సాహపు ఛాయలు మనకు అభినయములో గోచరమగుచున్నవి.

"దైన్యం" — నభినయించుటలో 'ఔత్సుక్యం' కొంత వరకు మరుగుపడుచున్నది.

అటుపై "హర్షం" — "హర్షం" దైన్యము తరువాత అభినయించుటచే దైన్యం చక్కగా కాంతివంతంగా ప్రకటింప జేయుటకు అవకాశమున్నది.

పిమ్మట "ఔత్సుక్యం" — ప్రదర్శించుటవల్ల "హర్షం" ను ప్రకాశవంతంచేయుటయే గాక, స్వాధీనపతిక, ప్రగల్భ యొక్క స్వరూప నిరూపణకు చక్కగా ఉపకరించుచున్నది.

ఈ విధంగా సంచారీ భావములు కూర్పుచేసి అభినయించవలెను.

అందెందు దిరుగకుర - అతివలు నీతోడి
ఉగ్రత, అమర్షం అసూయ

పొందుగోరి ఏ వేళ పొగరుచున్నారు
విషాదం మోహం

ఉగ్రత : ఝుడిపించుట, కన్నులెఱ్ఱజేయుట, తలను ప్రక్కలకు క్రిందిమీదులకు ఆడించుట. వీని నభినయించుటవల్ల ఉగ్రత ప్రదర్శితమగుచున్నది. ఉగ్రత ముఖ్యముగా వీరరసమందు పుట్టుచున్నది. కాని యిచ్చట శృంగారరసమందు ఉగ్రత ప్రదర్శించబడుటచే —

ప్రారంభములో పై భావములను అభినయించి అటుపై శృంగారమును ప్రాధాన్యము పోషించుటకు వేడుకొను భావమూ, లాలించు భావము, బుజ్జగించు భావము, ప్రార్థించు భావము వీటిని ప్రదర్శించవలెను. తరువాత "అమర్షం" పట్టవలెను. ఈ భావములన్నీ అభినయించిన తరువాత "అమర్షం", "రోషము" నభినయించిన — ఇన్ని తెరగుల నే వేడినా నీవు వినవా; వినవై తివిగా, నామాట — అనే అధికారము అందు గోచరించును. నాయిక స్వాధీనపతిక గనుక ఈ అభినయము అందు ఒప్పును; రస భంగము కాదు.

అమర్షం అవమానింపబడుట, ధిక్కరింపబడుట వల్ల కలిగే మానసిక స్థితి. అమర్షం లేక రోషము. కొందరు అమర్షం, క్రోధము ఒకటిగా అభినయింతురు. కాని రెంటిలో కొంత తేడా వుంది. క్రోధము పూర్తిగా శత్రుత్వాన్ని సూచించేటప్పుడు మాత్రము ఉపయోగపడే అభినయము. అమర్షం యితర రసములకు ముఖ్యంగా శృంగారమునకు సహకరించును.

శిరస్సును కంపించుట, ఉత్సాహము, తర్కించుట, చింత వీటిచే అమర్షం కనబర్చవచ్చును. శృంగారముతో చేర్చి ప్రదర్శిస

వలసి వచ్చినప్పుడు నాయకుని ఆజ్ఞాపించుట కలవిగాక దైన్యభావములు ప్రకటించుటవల్లగూడ ప్రదర్శింపవచ్చును. ఈ విధమైన ప్రదర్శన, అమర్షమును మరింతగా ప్రకాశింపజేయును.

అతివలు నీతోడి

**అసూయ**

ఇందు ఆంగికము (హస్తాభినయము) సాత్వికము, రెండూ ప్రదర్శింపబడును. ఇతరులయెడ అసహనమే, అసూయలో ముఖ్యముగా ప్రదర్శితమగును.

మొటికలు విరుచుట, మోము ప్రక్కకు త్రిప్పుట, పెదవి విరుచుట, బొమలు చిట్లించుట, నిందించుట (గుణ దోషము, అవయవ దోషమును వర్ణించుట) కోపము ప్రదర్శించుటవల్లనూ, తన యొక్క విశిష్టతను తెల్పుటవల్లను (యిది గర్వము ద్వారా ప్రదర్శితమగును) అసూయ నభినయించవచ్చును. తన ఘనత తెల్పుటవల్ల యితరులందు ఆ గొప్పతనము లేదనే భావము ధ్వనించును. ఇది గుణ దోషము. అవయవ దోషము వలన గూడా ప్రకటించవచ్చును.

అతివలు ఈ పదమునకు పదార్థాభినయమును గూడా ప్రదర్శించవచ్చును. అప్పుడు "స్త్రీ" అను మాటకుగల అనేక పర్యాయ పదములకు ఆంగికము పట్టవలెను.

ఉదాహరణ : లతాంగి, కోమలాంగి, కమలాక్షి, మీనాక్షి యిత్యాదులకు అభినయం. కాని ఈ అభినయంలో సాత్వికము వ్యతిరేక భావమును ధ్వనింపచేయునట్లుండవలెను. అనగా లతాంగి-లతాభినయమును, ఆంగికములో ప్రదర్శిస్తూ సాత్వికములో అట్టిది కాదు, అనే భావము వచ్చేరీతిని ప్రకటించవలెను.

పొందుగోరి ఏ వేళ
**విషాదం**

పొందు : శృంగార చేష్టలు. ఆలింగన, చుంబన, బంధన విశేషములు. ఇది ఆంగికములో, సాత్వికములో ప్రదర్శింపవలెను.

ఉదాహరణ : చుంబనము.

చుంబన రీతిని ముద్రల్లో ప్రదర్శించుట ఆంగికము ద్వారా ప్రదర్శించి, ఆ చుంబన సమయమప్పటి మానసిక స్థితిని నేత్రముల ద్వారా ప్రదర్శించవలెను.

ఇట్లే యితర శృంగార చేష్టలు గూడ అభినయించవలెను.

విషాదం :— ఇష్ట పదార్థప్రాప్తి యితరులకు కలుగునని చింతించుట.

ముఖమునందు దీనత్వము
మనసు మనసున నిలువకుండుట
చేతులు పిసుకు కొనుట
అటు నిటు చూచుట తిరుగాడుట
ఏమీ తోచకుండుట వీని నభినయించవలెను
పొగరు చున్నారు
**మోహం**

మోహము :— భయము, దుఃఖము చేత పొందే మూర్ఛాస్థితి భాగవత కలాపములందు, యక్షగానములందూ, మోహమును అభినయించినప్పుడు, నర్తకి మూర్ఛపోయినట్లు అభినయించును. ప్రక్క పాత్రలు, శైత్యోపచారములు చేయుచూ ఆ పట్టును

ముగింతురు. కాని నాయికాభినయం ఏకపాత్ర సంప్రదాయము. చెంత సఖు లెవ్వరూ వుండరు. అందువల్ల మూర్ఛపోయినట్టు పూర్తిగా ప్రదర్శించక కొన్ని అంశములు అందలివి ప్రదర్శింతురు.

ఏ విధముగా ననగా :—

ఇంద్రియములు శూన్యత గల్గియుండుట, గుడ్లు తేలవేయుట. శరీరము పట్టుదప్పి ఒరుగుతున్నట్లు ప్రదర్శించుట. వీనివల్ల మోహము ప్రకటితముగాదు.

ఇక యక్షగాన రీతులందు ప్రదర్శించే విధము :— మదనుడు విడువక నాయికపై బాణములు సంధించుచున్నాడు. 5వ బాణము. "నీలోత్పలము" ముద్రను ప్రదర్శించగానే మరణము సూచించును. మూర్ఛపట్టును నాయిక పాత్ర ప్రదర్శించును. చెలులు పువ్వుల పాన్పును పరిచి అందుపై నాయికను పవ్వళింపజేసినట్లు, చందన కర్పూరముల లేపనము ఆమె శరీరమునకు నలది, తాపము తగ్గింప చేయుటకు ప్రయత్నించినట్లు విసనకర్రలతో విసిరి తాపము చల్లార్చినట్లు అభినయింతురు. ఈ ఉపచారములు ముగించిన పిదప నాయిక తేరుకొనినట్లు అభినయించును, కథ ముందుకు సాగును.

ఇట్టివే కొన్ని భేదములు నట్టువమేళ, నాట్యమేళ మందలి అభినయములో కన్పట్టుచున్నవి. శాస్త్ర మొక్కటే అయినా యెవరికి కావలసిన రీతిని ఆ కళావేత్తలు దానిని మలచుకొని ఉపయోగించు కొంటున్నారు. దీని ననుసరించే సంప్రదాయములు వేరువేరుగా వృద్ధిలోకి వచ్చినవి. ఒకే సంప్రదాయమందు కూడా, ప్రముఖులైన కళావేత్తల ప్రదర్శనములో కొన్ని కొన్ని భేదాలు కన్పించుచున్నవి. కాని మూలసూత్రాలు మాత్రమొక్కటియే. యక్షగాన, భాగవత కలాపములందు అభినయించు పాత్రకు అన్ని

హంగులు సమకూడియుండును. చతుర్విధాభినయానికి అనువైన రీతిని పాత్ర రూపొందును. కాని ఏకపాత్ర కేళికలో పాత్రకు అట్టి అనుకూలత లేదు. ప్రతి భావములో తానే సంచారము చేసి, మరల ప్రారంభస్థితికి రావలసివుండును. రసభంగము కాకుండా నాయిక తానే అనవలె. సఖిని తానే అభినయించవలె. ఒక్కొక్క సారి నాయకుని భావములు కూడా ఆ పాత్రయే ప్రదర్శించవలెను. మరియు నాయిక నిరూపణ ప్రేక్షకులందు చేయవలె. ఆహార్యాభినయము యొక్క సహాయము తక్కువగా వుండును. గనుకనే ఏకపాత్ర కేళికల్లో నాయికల అభినయం చాల కష్టతరమైనట్టిదిగా శాస్త్రవేత్తలు అభిప్రాయపడుదురు.

యెందరెందరని కాతు—యెంతని నే విన్నవింతు
**అమర్షం,** వితర్కం, దైన్యం
యెంద రెందరని కాతు
**అమర్షం,** వితర్కం

తర్కించుట, శిరస్సు కంపించుట, చింతించుట; నిస్సహాయత, ఆలోచించుట అభినయించవలెను.

యెంతని నే విన్నవింతు
దైన్యం

నిరాశ, కన్నీరు, నిట్టూర్పు, వేడుకొనుట—వీని నభినయించవలెను.

పందె మాడుకున్నారట
**విషాదం,** శంక

ముఖమును జాలిగొల్పు నట్లుంచుట, ఏమియుతోచక చింతించుట, అటనిటు తిరుగుట, ఈ భావముల ప్రదర్శనద్వారా విషాదమును;

వెలవెలబోవుట, దిక్కులు జూచుట, తొందరపాటువల్ల, శంకను అభినయించవలెను.

పట్టుకపోయెదమనుచు
ఔత్సుక్యం, దైన్యం

ఔత్సుక్యం :— సంతాపము, తాళలేక పోవుట, చింత, నిట్టూర్పు; శరీరములో వణకు, శరీరము బరువగుట, బోధనచేయు చున్నట్లు కనబర్చుట.

పట్టుక పోయెదమనుచు :— నిజముగా తన స్వామిని అన్య స్త్రీలు అపహరించిన, ఆ యెడబాటును తానోర్వగలదా? ఆ తలంపు కల్గినప్పుడు దైన్యము ప్రదర్శితమగును. ఆ యెడబాటువల్ల తాననుభవించే అవస్థలు అతని నితరులు అపహరించకుండ, తన నుండి వేరు పరచకుండుటకు తాను ఆలోచించవలసిన మెలకువలు, తను వేసుకోవలసిన చర్యలు, అందుమూలముగా అతడు అన్యులపాలు గాడని మనోనిబ్బరం. ఏమో అంత యత్నమూ వృధా అగునేమో నని ఆవేదన. ఈ విధమైన వ్యతిరేక భావములు ప్రదర్శింపవలెను. ఈ విధముగా అభినయించుటలో "ఔత్సుక్యం," 'దైన్యం' ముందు వేరు వేరు అభినయించి పిమ్మట రెంటినీ ఒకటి తరువాత ఒకటి మార్చి మార్చి అభినయించవలెను.

చ॥ పలుమారు నా సామి—బయలు వెళ్లకు మ్రొక్కె
దైన్యం విషాదం
నిలుపరాని మోహమున—నిన్ను జూచి చెలులు
మోహము అసూయ
దైన్యం, విషాదం—ముందటివలె అభినయించవలెను.
నిలుపరాని మోహమున
మోహము

శరీరము బరువెక్కుట, శరీరము పులకరించుట, చెమర్చుట, చెక్కిళ్లు చెమర్చుట, కన్నులు మూతలు పడుట, నేత్రములు కాంతి తగ్గియుండుట. పెదవులు వణకుట, కుచములు వుబ్బుట, శరీరము పట్టు తప్పుట, నిలువలేనిస్థితి, అవయవములు సడలుట ఇవన్నియూ "మోహము"నందు పట్టవలెను. అసూయ ముందటివలెనే ప్రదర్శించవలెను.

అలరు నీమోవి తేనె యాని చప్పరించవలసి
ఔత్సుక్యం హర్షం
కులుకు గుబ్బల రొమ్ము—గుమ్మ పొయ్యెదరనుచు
ఈర్ష్య, విషాదము ఉగ్రత, విషాదం

"మోవి తేనె యాని చప్పరించ" చుంబన విశేషముల నభినయించవలెను. ఇది ఆంగికము. సాత్వికములద్వారా ప్రకటింపవలెను.

ఇందు రెండు విధములైన భావవిన్యాసమున్నది.

1. మోవి తేనె : యితరులు అనుభవించుట ఒక విశేషము.

2. మోవి తేనె తనకుగాక యితరులచే అనుభవింపబడుట మరొక విశేషము.

1—వ భావవిన్యాసమునందు ఆంగికము ప్రదర్శించుతూ, సాత్వికము సంతృప్తిని గనబర్చవలెను.

2—వ భావవిన్యాసమునందు అన్యులు ఆ ఆనందాన్ని పొందుతున్నారనే ఆవేదన, ఉక్రోషము, బాధ, అసూయ, చింత యివన్నియూ సాత్వికములుగా ప్రదర్శించవలెను.

ఇంత జేసి యిదంతయూ తరుగునట్టిదిగాదు. జరుగబోవునని ఊహించుకొని నాయికపడే తత్తరపాటు ఆవేదన మాత్రమే దీనికి "హర్షం" చేర్చిన భావవిన్యాసం మరింత రక్తికి వచ్చును.

అదెట్లనగా హర్షమునందలి వివిధభావ వికాసరీతులు ముఖమందు సంతృప్తి, నేత్రముల వికాసము, పులకరింతలు, ముదలైన అనుభూతులను అన్యస్త్రీ అనుభవించుచున్నట్లు కనబర్చుట.

అయ్యో అవన్నీ ఆ అతివ అనుభవించును. తనకు దక్కవు అని చింతించుట ఇట్లు జరిగిన తను బొందే నిరాశను వ్యక్తపరచుట హర్షమునందు ప్రదర్శించవలెను.

కులుకు గుబ్బల రొమ్ము — గుమ్మిపోయ్యేటరిపును
**ఈర్ష్య, విషాదము** ఉగ్రత; విషాదం

"కులుకు గుబ్బల రొమ్ము గుమ్మి" పోవుట.

పరస్త్రీలు తన స్వామిని గుమ్మిపోవుటలో ఈర్ష్య, అసూయ కల్గుట సహజము. ఈర్ష్య అభినయించు విధము యిదివరకు తెల్పియున్నాను. కాని వారు కులుకు గుబ్బల గుమ్మటవల్ల తన స్వామి దేహమెంత కందిపోవునో, బాధచెందునో అని అతనికి యేదో బాధ కల్గునని తాను ఊహించుకొని విషాదము పొందుట యిచ్చట విశేషము. నాయకుడు ఆ బాధ ననుభవించుటకు యిచ్చగించవచ్చును. పీడింపబడుటకు సమ్మతింపవచ్చును, కోరవచ్చును. కాని నాయిక యిట్టివిధముగా నాలోచించక తనంతట తానే యితరుల బాధ లూహించుకొని ఖేదపడుట ప్రగల్భకు తగినట్టి లక్షణమే. అంతియేగాక వారు "కుమ్మి పోయెదరని" తానాగ్రహాము వహించుట, ఝుడిపించుట, కన్నులెర్రచేయుట యిత్యాదులు ప్రదర్శించవలెను.

చ. ముదముతో మా ముద్దు — మువ్వగోపాలస్వామి
**హర్షము** **మోహాము**
గుదికొన్న తమకమున — గూడి యిద్దరము
**ఔత్సుక్యం** హర్షము

**హర్షము :** ముఖము, నేత్రములు వికసించుట. పులకింతలు, చెమర్చుట, చేతులు తట్టుట, హసియించుట, శరీరము పొంగిపోవుట.

**మోహము :** నిమీలిత నేత్రములు, భారమైన శరీరము, బరువెక్కిన కనురెప్పలు, నిట్టూర్పులు.

**ఔత్సుక్యము :** తాళలేకపోవుట, మదన తాపము, శయనించుట యందభిలాష, శరీరభారము నాయకునికి కనబర్చుట.

నిదుర పరవశమున - వదలునో కౌగిళ్ళు
సుప్తి ఔత్సుక్యం, శంక

పదిలముగ నా జడను — పట్టి కట్టుకొందునా
హర్షం వితర్కం దైన్యం

**సుప్తి :** కన్నులు మూసికొనియుండుట, కదలక యుండుట ప్రదర్శించి, ఆలింగన భేదములుచూపి ముగించవలెను. మిగిలిన సంచారులన్నింటినిగూర్చి ఈ నాయికకు ఒప్పునట్టి భావములు ముందుగా తెల్పినాను. సుప్తిని అభినయించుటలో పట్టే కొన్ని భావములను గూర్చి మాత్రము ప్రస్తావించుచున్నాను.

గాఢనిద్రలోనుండి — తనస్వామి నెవరో పట్టుకొనిపోయినట్లు పలవరింతలు, దిగ్గున నిదురమేల్కొని కలతజెంది కంగారుపడుట, తన స్వామి తనయొద్దనే వున్నారని సంతృప్తిపడుట, గాఢముగా కౌగలించుకొనుట, అధరము పానముచేయుట, చెక్కిలి ముద్దిడుట, తన జడతో స్వామిని మగల గట్టివేయుట — ఇవన్నియూ ప్రదర్శన యోగ్యములు.

ఈ పదము నభినయించిన ప్రముఖ కళావేత్తలు :

పశ్చిమగోదావరిజిల్లాలోని మారంపల్లి గ్రామములో శ్రీమతులు చిత్తజల్లు పెదవేంకటరత్నం, చిన్న వేంకటరత్నం, వైదేహి, ఇందు

వదన నల్గురు నర్తకీమణులుండేవారు. వారు భామాకలాపము, గొల్ల కలాపములనేగాక, కర్నాటకము, అభినయముగూడా ప్రదర్శించే వారు. సంస్కృతము, తెనుగు, భరతశాస్త్రములను అభ్యసించిన వారు. శాస్త్రమూ, సంప్రదాయములను సమన్వయించి నర్తనము సల్పేవారు.

శ్రీమతి చిన్నవేంకటరత్నం, నేను మారంపల్లి వెళ్ళినప్పుడు ప్రత్యేకంగా ఈ పదము నభినయించి చూపినది. అప్పటికి ఆమెకు డెబ్బది సంవత్సరముల వయస్సు వుంటుంది. అభినయములో ఆంగి కము యెవరైనా ప్రదర్శింపవచ్చును, గురువులవద్ద నేర్చిన హస్తాభి నయముతో. సాత్వికమునందు అట్లుగాదు;నర్తకి తన హృదయములో చిత్రించుకున్న భావములను ముఖముపై పలికించవలెను. కళాకారుడు ఊహల్లో యెంతయో భావ పరంపర సృష్టించుకోవచ్చును. గాని అవన్నియూ ప్రేక్షకులు అనుభవించురీతిని ప్రదర్శించుట సామాన్యము గాదు. అట్టి భావాభినయము ప్రదర్శించుటయే విశేషము. అట్టి వారినే ఉత్తమ కళాకారులుగా శాస్త్రజ్ఞులు యెంచెడివారు.

"అందమైన నీ మోము - అయ్యలూ ముద్దు గుల్కుచున్నది"

ఈ అనుపల్లవికి ముఖ్యంగా సాత్విక ప్రదర్శనము అమోఘము. అందమైన మోమును జూచినప్పటి ఆనందము, ముద్దుగుల్కుచున్న తీరును ముఖజా అభినయము ప్రదర్శించి, మిగిలిన పదానికంతకూ ఆంగిక సాత్వికభావ ప్రకటన, ఈ రెంటిని విపులంగా తెలిసికొనే అవకాశమేర్పడినది.

హైదరాబాద్‌లో కూచిపూడి నృత్య సదస్సు జరిగినప్పుడు కర్నూలుజిల్లాకు చెందిన కోటకొండ గ్రామస్థులు బ్రహ్మశ్రీ చల్లా భరతశాస్త్రం లక్ష్మీనారాయణశాస్త్రిగారిచే ఈ పదం అభినయము

చేయించి చూచాను. వీరు భాగవత సంప్రదాయములో ప్రసిద్ధులు పండితులు. భామాకలాపమేగాక, జయదేవుని అష్టపదులను, క్షేత్రయ్య పదములను ప్రత్యేకంగా అభినయించేవారు. ప్రతిమాట వ్యాఖ్యానము చెప్పుతూ, వారు ప్రతిమాటకు ఆంగికము ప్రాధాన్యముగా అభిన యించి చూపినారు. అంతేగాక వారు పట్టే ప్రతి హస్తానికి అభినయ దర్పణములోని శ్లోకాలు, ఆ హస్తాల వినియోగాలకు సంబంధించి నట్టివి చదివి, ఆ వినియోగము తీరులను తెల్పుతూ అభినయించి నారు. ఇట్టి అభినయముగూడా అరుదే. వారి వయస్సుగూడ డెబ్బది నాల్గు సంవత్సరములు. ఆ యిరువురు కళాకారుల విద్యలో రెండు పద్ధతులు తెలిసికోగల్గినాను. రెండూ విశిష్టమార్గములే.

మదరాసులో ప్రతి సంవత్సరము జరిగే సంగీత నృత్యోత్స వాలకు ఒక సంవత్సరం శ్రీ విస్సా అప్పారావుగారితో కలిసివెళ్లాను. South Indian Fine Arts Association ఆహ్వానముపై — Egmore Theatre లో జరిగినవి సభలు. పదములు సాత్వికాభి నయముపై ఉపన్యసిస్తూ నేను.

"అందమైన నీ మోము, అయ్యలూ ముద్దు గుల్కుచున్నది".

ఈ అనుపల్లవికి సాత్వికము మాత్రము ప్రదర్శించాను. సభలో ప్రేక్షకులందరు ముగ్ధులై చూస్తున్నారు. దక్షిణాదిలో ముఖ్యంగా ఆంగికముతోగూడిన సాత్విక మేగాని, ప్రత్యేకంగా ముఖాభినయము ప్రదర్శించుట ఈ కాలంలో తక్కువ. దానికి భాష, నుడికారముతో ఆచార్యులకు పరిచయము తక్కువగుటయే ముఖ్యకారణము. ఆ సమ యములో ఒక ప్రముఖ నాట్యాచార్యుడు లేచి నిలబడి —

"అయితే దీనికి ఆంగికము లేదా" అని విమర్శిస్తూ ప్రశ్నిం చాడు.

నా ప్రదర్శనము నాపి –

"మీ ఆంగికము యెక్కడ ఆఖరవుతుందో మా సాత్వికము అక్కడ ప్రారంభమవుతుంది. కనుక ఆంగికము మీకు వదలి, సాత్వికము మాత్రము నేను ప్రదర్శిస్తున్నాను" అని సమాధానము చెప్పి మరల అభినయానికి పూనుకున్నాను. ఆంగికం అందరూ ప్రదర్శించగలరు. సాత్విక ప్రదర్శనమే అపూర్వం, అరుదు.

ఈ అభిప్రాయంతో అక్కడ చేరిన పండితులందరూ అంగీకరించారు.

రాగము, తాళముగూర్చి అభిప్రాయము - కొన్ని గ్రంథములందు ఈ పదమునకు శహన, కాఫీ, ఖరహరప్రియరాగములుగూడ పేర్కొన్నారు. అట్లే రూపకతాళముగూడా చెప్పబడినది.

శహన కరుణ ప్రాధాన్యంగావున్న భావప్రదర్శనకు సరిపోవును. కాఫీ తూకము ఈ నాయికాభినయానికి చాలదు. ఖరహరప్రియ సంచారము ఈ పదములోని నాయిక సంచారీ భావముల ప్రదర్శనకు పూర్తిగా అనుకూలించుటలేదు. కళ్యాణి మాత్రము పూర్తిగా సరితూగునట్టి రాగము. నేను వినిన పెద్దలు కళ్యాణి, రాగమునందు మాత్రము పాడినారు. నేనభ్యసించినదిగూడ కళ్యాణి, ఝంపె తాళమునందు - ఝంపె తాళగతియందలి చురుకుదనము రూపకమునందుండదు. గాన ఈ పదమును ఝంపెయందే గానము చేసిన సరిపోవుచున్నది.

# ముందటివలె నాపై

**రాగము - భైరవి; తాళము - త్రిపుట**

ప. ముందటివలె నాపై నెనరున్నదా? నా సామి
ముచ్చటలిక నేలరా ?''

అ. ఎందుకు మొగమిచ్చకపు మాటలాడేవు
ఏరా మువ్వగోపాలా మేరగాదుర ! నా సామి ॥

చ. పిలువనంపిన రావు పిలిచిన గైకోవు
పలుమారు వేడిన పలుకవు
వలపు నిలుపలేక చెలువుడవని నిన్నే
తలచి తలచి చాలా తల్లడిల్లుచే గాని ॥

చిన్ననాటినుండి చేరిన దెంచక
నన్ను చౌక చేసేది న్యాయమా ?
వన్నెకాడ నీదు వంచెన లెరుగనా
నిన్నన బనిలేదు నే జేసిన పూజకు ॥

కలుపల రేడంచు కంచివరదా నిన్నా
లలన యింత దూరము రానిచ్చెనా
అలరువిల్తుని కేళి నలముకొనుచు నన్ను
కలిసిన పాపానికి కన్నుల జూడవచ్చితివో ॥

"ముందటివలె నాపై
నెనరున్నదా నా సామి"
నాయిక — స్వీయ, ఖండిత, మధ్యధీరాధీర
నాయకుడు - శఠుడు
అయోగ విప్రలంబ శృంగారము - రౌద్రరసము

ఒక సంప్రదాయమువారు ఈ పదమును స్వీయనాయికగా అభినయించుచున్నారు. మరొక్క సంప్రదాయములో నాయిక— పరకీయ, పరోఢగా గూడ అభినయించుట ప్రచారమందున్నది.

ఈ రెండింటిలో సంచారి భావముల పోషణలో కొన్ని మార్పు లున్నవి.

స్వీయనాయికలో అయోగ విప్రలంబముగానున్న శృంగారం, పరకీయలో ఈర్ష్యామాన విప్రలంబముగా మారుచున్నది. మరియు రౌద్రానికి అవకాశము లేదు. ఈ రెండు విధముల అభినయము యిందు వ్రాయుచున్నాను.

నాయిక — స్వీయ.

సంచారులు — స్మృతి, రోషముతోకూడిన గర్వం, వితర్కం, శంక, చింత, దైన్యం, విషాదం, నిర్వేదం, అవహిత్థ, విషాదముతో గూడిన దైన్యం, ఔత్సుక్యంతోగూడిన విషాదము, దైన్యముతో గూడిన విషాదం, ఆవేగముతోగూడిన విషాదం, ఔత్సుక్యం, ధృతి, అధ్యానము, ఆర్తి, జాగు, ఉన్మాదము, అసూయతోగూడిన బోధము, బోధము, మతి, ఈర్ష్య, శ్రమ, సుప్తి, హర్షము, వితర్కంతోగూడిన స్మృతి, రతివిశేషములు, శైత్యోపచారములు—

రోషముతోగూడిన గర్వం

విషాదముతోగూడిన దైన్యం

ఔత్సుక్యంతోగూడిన విషాదం

రెండేసి సంచారి భావములను ఒకదానితో మరొకటిచేర్చి అభినయించెడి తీరెట్టిదనగా—

ఉదాహరణ : రోషము, గర్వము.

రోషము : అవమానపరచుట, కించపరుచుట, తక్కువ చేయుట, చిన్నచూపు చూడబడుటవల్ల కలిగే కోపము రోషమగును.

ఈ రోషము : శిరఃకంపము

చింతించుట

తలవంచుట

తలవంచుకొని యోచించుట.

తర్జనభర్జనలు వీటివల్ల ప్రదర్శింపబడుచున్నది.

గర్వము : పరులను కించపరచి, తనని గొప్పజేసికొనునట్టి అతిశయమే గర్వము. అహంభావము, పరుషవాక్కు, మోము త్రిప్పుకొనుట; ధిక్కారభావము చూడకయుండుట మొదలైన వానివల్ల గర్వము ప్రదర్శింపబడును.

ఈ రెండిటిని చేర్చి :

ముందటివలె నాపై
(రోషంతోగూడిన గర్వం)
అభినయించినప్పుడు

శిరః కంపముతో, రోషముతో ప్రదర్శించి, మోము ప్రక్కకు త్రిప్పుటద్వారా గర్వమును చింతించుటద్వారా — రోషమును అభినయించి అహంభావముతో — గర్వమును.

తలవంచుకొని చింత నభినయించుటతో రోషమును జూపి ధిక్కారభావముతో గర్వమును, ఈ విధముగా ఒక భావముతో అభినయము ప్రారంభించి రెండవదానితో ముగించవలెను.

ఈ రీతి కష్టతరమైనట్టిది అయిననూ అనుభవజ్ఞులు ప్రదర్శించిన ఈ నాయికయొక్క సంపూర్ణ, రూపకల్పన బహురమణీయము. అట్టి అవకాశము ఈ పదమొక్క దానియందు గలదు. అందులకే ఈ పదము ఆంధ్ర, తమిళ, కర్నాట ప్రాంతాల్లోని నర్తకులలో విశేష ప్రచారము గాంచినది.

ప. ముందటివలె నాపై

స్మృతి - రోషముతో గూడిన గర్వము

నెనరున్నదా ? నా సామి

| | |
|---|---|
| వితర్కం, | శంక |
| దైన్యముతో | ముగింపు |
| ముచ్చటలిక | నేలరా ? |
| చింత | వితర్కం |
| విషాదం | |

స్మృతి : గడిచిన విషయాలు జ్ఞప్తికి తెచ్చుకొనుట. కనుబొమలు యెగరవేయుట, దీర్ఘముగా ఆలోచించుచున్నట్లు కనబర్చుట.

(దృక్కులు ఒక్కచోట నిల్పి కొన్ని క్షణములు ఒకే స్థితిలో వుండుట అటుపై ఆకస్మిక దేహచలనము)

తలను ప్రక్కలకుగాని, క్రింది మీదులకుగాని ఆడించుట.

వీనివల్ల స్మృతి నభినయించవలెను.

రోషముతోగూడిన గర్వమును అభినయించు తీరు పైని తెల్పి యున్నాను.

నెనరున్నదా ? నా సామి

సందేహము, సంశయములను ప్రదర్శించుటవల్ల వితర్కము—

వర్ణము మారుట, వెలవెలబోవుటవల్ల శంకను ప్రదర్శించి.

ముఖమునందు, నేత్రములందు పేదరికము కనబర్చుటవల్ల దైన్యమును ప్రకటించి ముగించవలెను.

ముచ్చటలిక నేలరా ?

నిట్టూర్పు, సంతాపము, తలవంచుకొనుటవల్ల చింతను.

కనుబొమలు యెగురవేయుట, తల ఆడించుట, ఆలోచనల వల్ల వితర్కమును ప్రకటించి.

ఏమియు తోచకుండుట.

చేతులు పిసుకొనుచూ క్రిందికి చూచుటవల్ల విచారము కనబర్చి ముగించవలెను.

దైన్యము, చింత, విషాదం యివన్నియూ రోషభావమునకు ఛాయలుగా మాత్రము ప్రదర్శింపవలెను. శుద్ధముద్దా ఆయా సంచారుల ప్రదర్శనము మాత్రముగాదు.

అ ॥ ఎందుకు మొగమిచ్చకపు మాటలాడేవూ

వితర్కం, విషాదముతోగూడిన దైన్యం

ఏరా మువ్వగోపాలా మేరగాదుర

వితర్కం దైన్యంతోగూడిన విషాదం.

వితర్కం, శంక

వితర్కం : సందేహమువల్ల అనేక విధములైన ఊహాలు కల్పించుట యిచ్చట ముఖ్యముగా అభినయించవలసినది. వితర్కంలో కనుబొమ లెగురవేయుట, తలను ప్రక్కలకుగాని, క్రిందుమీదులకు గాని ఆడించుట సామాన్యంగా చేయు అభినయముగాని యిచ్చట.

ఎందుకు : అనే మాటను కేవలం ప్రశ్నార్థకంగా గాక ఏవో కొన్ని కారణాలు నాయిక కల్పించుకొని ఆయా కారణాల వల్ల అతడు "మొగమిచ్చకపు మాటలాడుతున్నట్లు' అభినయములో వ్యక్తపరచుటకు వితర్కం ప్రయోగించవలెను.

ఉదాహరణ :

"ఎందుకు మొగమిచ్చకపు మాటలాడేవూ ?"

ఎందుకూ ?

"ఆ చెలి నిన్ను తిరస్కరించినదా''

అందువల్ల నా వద్దకుచేరి ఈ విధంగా మొగమిచ్చకపులాడు చున్నావా ?

లేక అచ్చట అవమానింపబడి వచ్చితివా ? దాని మోసబుద్ధి తెలిసికొంటివా ? ఈ విధంగా భావములు కల్పించుకొని అభినయము పెంపొందించుటకు వితర్కం ఇచ్చట ఉపయోగించవలెను.

విషాదముతోగూడిన దైన్యం ;

ముఖములో విచారము కనబర్చుట

అటునిటు జూచుట

తలయెత్తి చూడకుండుట

నిరుత్సాహము

నిట్టూర్పు విషాదమందునూ

దైన్యములో నాయకునికి దయగల్గునట్లు ప్రవర్తనలను సవరించుకొనుటకు ప్రదర్శించవలెను. అనగా అప్పటివరకూ వితర్కంలో అనేక విధాలుగా తన ఊహలకు తోచినట్లు అవి అర్థం లేని ఆలోచనలు గావచ్చును. నాయకుని విమర్శించి అటుపై ఆ తాపము కొంత విషాదములో తగ్గించి, పూర్తిగా తగ్గునట్లు దైన్యంతో ప్రదర్శించవలెను. వితర్కంలో నాయకుడు, నాయిక ప్రవర్తనకు నొచ్చుకొనిన దైన్యంలో ఉపశమనము గల్గును. అందు వల్ల దైన్యములో అతిశయమును అణుచుకొనినట్టి నాయిక విన్యాసము లుండును. వితర్కంలో పూర్తిగా విజృంభించిన ఖండితభావ వికాసము ప్రకటితమగును. అది వేడుకొనునట్టి జాలిగొల్పె భావప్రకటన హీన స్వరములో ముగియును.

ఏరా మువ్వగోపాలా

**వితర్కం**

కనుబొమ లెగురవేయుట, తలను ప్రక్కలకు క్రిందుమీదుల కాడించుట, యిత్యాదులు వితర్కంలో ప్రదర్శింపవలెను.

మేరగా దుర

**దైన్యంతో గూడిన విషాదము**

వితర్కం, శంక

దైన్యంతోగూడిన విషాదములో ప్రారంభములో జాలిగొల్పు రీతిని, భావప్రకటనజూపి, అటుపై క్రమముగా భావముల్లో కొంత కఠినత్వము ప్రదర్శించవలెను.

ఎట్లనగా—

వేడుకొనునట్లు,

నమస్కరిస్తున్నట్లు,

ముఖములో పేదరికముతో దైన్యం ప్రదర్శించిన పిమ్మట...
ముఖము ప్రక్కకు త్రిప్పుకొనుట
నాయకునిచూడ నిచ్చగించకుండుట.
నిర్లక్ష్యము ప్రదర్శించవలెను
అటుపై — వితర్కం - లో.

మరికొంత కాఠిన్యత ప్రదర్శించుట కవకాశమేర్పడును.

'శంక'లో - సంశయములు, సంశయ నివృత్తిని ప్రకటించవలెను.

చ ॥ పిలువ నంపిన రావు పిలిచినను గైకోవు
ఔత్సుక్యంతో గూడిన విషాదం, వితర్కం
ఆవేగముతో గూడిన విషాదం, వితర్కం
జాగును తాళలేక పోవుట ఔత్సుక్యము
సంతాపము, నిశ్వాస, చింతన, త్వరపడుట

వీని అభినయముతో ఔత్సుక్యము ప్రదర్శితమగును.
ఇష్టపదార్థ ప్రాప్తిగలుగనందున గల్గిన ఖేదము, విషాదము.
చేతులు పిసుకుకొనుట
ముఖమున విచారము
ఏమియును తోచకుండుట
ఉత్సాహము లేకయుండుట
వీనిని విషాదమునందు ప్రదర్శించవలెను.
వితర్కం — కనుబొమల నెగురవేయుట, ఎత్తుట.
బొమముడి తలనాడించుటద్వారా ప్రదర్శించవలెను.

ఈ మూడు భావములనుచేర్చి పట్టవలెను.

ఆవేగముతోగూడిన విషాదం, వితర్కం :

మనస్సులోని తడబాటు; స్తంభము, రోమాంచము, ఆలింగనములు, ఆవేగమున ప్రదర్శించి నాయిక పీసిసి నాయకుని యందభిలషించినట్లు ప్రకటించి ...

పిమ్మట విషాదం, వితర్కములతో ముగించవలెను.

పలుమారు వేడిన — పలుకవు.

దైన్యముతోగూడిన విషాదం, ధృతి.

దైన్యముతోగూడిన విషాదం.........

ముఖమందు, నేత్రములందు, స్వరమందు పేదరికము, వేడుకొనుట, నమస్కరించుట, శరీరము కుంచుకొనుట, అతిశయము అణచుకొనుట, కన్నీరు వీనివల్ల దైన్యమును ... ...

చింతించుట, నిట్టూర్పు, తలనువంచి వుంచుట, నిస్సహాయత వల్ల విషాదమును ఈ రెంటిని చేర్చి ప్రదర్శించవలెను.

ధృతి = అభినయము రెండు విధములుగా యిచ్చుట వుండును.

1. ఇన్నివిధముల నాయిక వేడుకొనుచుండగా, నాయకుడు లెక్కసేయక నిర్లక్ష్యంగా వుండుట, మనస్సు వేరొకచోట లగ్నమై యుండుట, నాయిక యెడల అనురాగము కనబరచకుండుట . . . ఒకవిధము.

2. ఇన్నివిధముల వేడుకొని, నాయకుని ప్రసన్నుని చేసుకొనలేక, నాయికగూడా విరక్తి భావములను వ్యక్తపరచుట రెండవది.

మొదటి అభినయము మాత్రము ధృతిలో ప్రదర్శించిన యెడల అంతటితో ముగించవచ్చును. కాని రెండవ విధమైన అభినయము కూడ ప్రదర్శించిన 'విషాదం' గూడా ప్రదర్శించవలసి వుండును. కానిచో తరువాత వచ్చే అభినయమునకు రసభంగము వాటిల్లును.

వలపు నిలుపలేక - చెలువుడవని నిన్నే
**ఔత్సుక్యం, హర్షం, ధృతి, నిర్వేదం, మతి**

ఔత్సుక్యం : మన్మథ తాపము, శరీరము బరువెక్కుట, చెమర్చుట, గగుర్పాటు, నేత్రములు మూతలుపడుట, రెప్పలు బరువెక్కుట, శయనించుట యందు ప్రీతి, తొందరపడుట, ఒకచోట నిల్వలేక యిటునటు తిరుగాడుట, చింతించుట, తత్తరపాటు, పెదవులు తడియారుట, వణకుట, యిత్యాదులు పట్టవలెను.

నిర్వేదములో : విచారము, కన్నీరు, నిట్టూర్పు, వీని నభినయించవలెను.

చెలుడవని నిన్నే,

హర్షం: ముఖము నేత్రములందు వికాసము, పులకాంకితము, శరీర ముప్పొంగుట, చేతులు తట్టుట, శరీరము చెమర్చుట వీని ద్వారా హర్షం ప్రదర్శించవలెను.

మతి : సంశయ నివారణమైనట్లు, సంతోషము కనబర్చుట, కనుబొమల నాడించుట — వీనితో మతిని ప్రదర్శించవలెను.

ధృతి : సంచారి భావమును ధైర్యమును ప్రదర్శించుట ద్వారాను ప్రకటించవలెను.

తలచి తలచి చాలా . . . తల్లడిల్లులేగాని

అధ్యానము, ఆర్తి, ఆలస్యము, ఉన్మాదము శైత్యోపచారములు.

అధ్యానము : ప్రియవస్తువు లభించినందున మనసులో కలిగే ఆవేదనయే అధ్యానము. నిట్టూర్పు, సంతాపము, వీని వలన ప్రదర్శిత మగును.

ఆర్తి : రోషముతోగూడిన ఉద్రేకము, వియోగమువల్ల కలిగే శరీర పీడనము - కాక - దేహము స్థంభించుట, అవయవములు బిగి తగ్గిపోవుట, కన్నీరు, శరీరము వణకుట, ముఖము వాడిపోవుట, శరీరము వేడెక్కుట, కాళ్లు చేతులు వికృతముగ వేయుట-ఇవన్నియు ఆర్తియందు చెల్లును.

వీనికి శైత్యోపచారములు :

సేదదీర్చుకొనుట, విసురుకొనుట, చల్లని పదార్థములు గ్రహించుట, శయనించుట యిత్యాదులు పట్టవలెను.

ఆలస్యము : ఒడలు విరుచుకొనుట, ఆవలింతలు, నేత్రములు నలుపుకొనుట, కన్నులు మూతలు పడుట, నిద్రలో వున్నట్లభినయించవలెను.

ఉన్మాదము : చిత్తవిభ్రమము, సంబంధంలేని పనులు చేయుట, అకారణముగ నవ్వుట, నడచుట, కూర్చుండుట, లేచుట, కన్నీరు నించుట మొదలైనవి ప్రదర్శించవలెను.

చ॥ చిన్ననాటనుండి - చేరిన దెంచక
స్మృతి మతి ధృతి వితర్కం హర్షం

స్మృతి : గడిచిన విషయాలు జ్ఞప్తికి తెచ్చుట. రెండు విధములు......గడిచిన విషయములందలి ఆనందానుభూతులను కనబరచుట. తన ప్రస్తుత స్థితికి విచారము కనబరచుట.

మతి : ఆనందము వెలిబుచ్చుట.

ధృతి : గడిచిన విషయములను నాయిక జ్ఞప్తికి దెచ్చినను, తత్ అనుభూతులను తలంచక నాయకుడు ప్రవర్తించిన భావము, నిర్లక్ష్యము ప్రదర్శించుట.

వితర్కం : సందేహము. ఆలోచించుచున్నట్లు కనబర్చుట, బొమముడి, తలముందుకు ఆడించుట.

హర్షం : కన్నుల వికాసము, చెమర్చుట, పులకరింపు మొదలైన భావములు.

నన్ను చౌక జేసేది — న్యాయమా

వ్రీడ, నిర్వేదం, విషాదంతోగూడిన దైన్యం.

వితర్కం, శంక, నిర్వేదం, లజ్జ, సిగ్గు నభినయించుట వ్రీడ యగును, ముఖము క్రిందకు దించుకొనుట, మరుగు పరచుకొనుట, ముఖము మళ్లించుకొనుట, వెలవెలబోవుట, గోళ్లు గిల్లుకొనుట వీనిచే వ్రీడను అభినయించవలెను.

**నిర్వేదము :** మాటలందు ముఖమందు పేదరికము, కన్నీరు, నిట్టూర్పు, వేడుకొనుట, నమస్కరించుట.

**విషాదముతోగూడిన దైన్యం :** ఉత్సాహములేక యుండుట, చింతించుట, నిట్టూర్పు, వేడుకొనుట, ప్రాధేయపడుట, హీనస్వరము.

వితర్కం, శంక ముందు తెల్పినారు ఆ భావములనే పట్టేది.

వన్నెకాడ నీదు — వంచన లెరుగనా

ఔత్సుక్యంతోకూడిన విషాదం

స్మృతి, అవహిత్థ, పశ్చాత్తాపం.

**ఔత్సుక్యం :** మనసు చాక చెందుట, నిశ్వాసము

**విషాదము :** శరీరభారము కనబర్చుట, చింతించుట, తల యెత్తి చూడకుండుట, ఉత్సాహములేక యుండుట.

**పశ్చాత్తాపం :** నీ వంచన తెలిసి నేను మోసపోయితిని. నమ్మినందుకు నన్నింత చులకన జేసితివి. నా తెలివితక్కువకు ఒకరి ననేమి లాభమున్నది ... అని తన్ను తా దూషించుకొనుట ఇత్యాది భావములు పట్టవలెను.

నిన్నని బనిలేదు — నే జేసిన పూజకు ॥

రోషముతో గూడిన గర్వం. ఈర్ష్యతో గూడిన బోధము వంటి నిర్వేదం, విషాదము, దైన్యము.

రోషముతోగూడిన గర్వము :

అపరాధముచేసిన వారియందు మనస్సు ప్రజ్వరిల్లుట రోషము.

తర్జన భర్జనలు, చింతించుట, తల పంకించుట, పరుల నిందించి తనను నుతించుకొనుట గర్వము, అహంభావము, చూడకయుండుట, తన అవయవములను జూచుకొనుట.

అహంభావము - తర్జన భర్జనలు;
చింతించుట - చూడకయుండుట ;
తలపంకించుట — తన అవయవములను జూచుకొనుట.

ఈర్ష్యతోగూడిన బోధము :

దోషారోపణ జేయుట ఈర్ష్య, నిందించుట, మోమున్ను ద్రిప్పుట, తిరస్కారము, కోపము, బొమముడి విషయము తెలిసి కొనుట బోధము. భుజములుపైకి ఆడించుట, చిటికెలు వేయుట, కన్నులు క్రమపద్ధతిని త్రిప్పుట.

నిందించుట, చిటికలు వేయుట, మోమును త్రిప్పుట, భుజములు పైకి ఆడించుట, కోపము, బొమముడి, కన్నులు క్రమ పద్ధతిని కదిలించుట, త్రిప్పుట.

**మతి:** మనసు ఒక నిర్ధారణకు వచ్చుట సంశయ నివారణము.

నిర్వేదము, విషాదము, దైన్యము ముందర చెప్పిన రీతిని అభినయించవలెను.

చ॥ కలువల రేడంచు — కంచివరదా నిన్నా
**హర్షం - ధృతి - మతి - అసూయ.**
లలన యింత దూరము — రానిచ్చేనా
**రోషముతోగూడిన గర్వం - వితర్కం, శంక.**

**హర్షం :** ముఖము నేత్రములందు వికాసము, పులకరింత, శరీరముపొంగుట, చేతులు తట్టుట.

**ధృతి :** లభించినదానితో తృప్తి నొందుట. ఇచ్చట ధృతి భావము. మనస్సుకు ధైర్యము దెచ్చుకొనుట అనగా—

"నీవు కలువల రేడంచు ధైర్యముతో ఆ లలన నిన్ను యింత దూరము రానిచ్చినదా ?" అని ప్రశ్నించటం.

"ఆ మనోధైర్యము లేనిచో రానిచ్చేది గాదేమో ?" ఈ విధంగా తర్కించుట.

"ఓ కలువలరేడా ! నీవు లేకపోయిననూ ఆమెకు నష్టము లేదేమో ?"

"నీ యెడబాటుకు ఆమె తపించదేమో ?"
"నీవు లేవని ఆమె చింతించదేమో ?"

"నన్నుగూర్చి యింత నిర్లక్ష్యభావమా — అను ధ్వనిలో ఆశ్చర్యభావము".

"నీ యెడల యింతటి నిరాదరణయా?" అని అపహాస్యము చేయుట.

"ఆమె పంపినది, ఆజ్ఞాపించినది, సమ్మతించినది, దయ తలచినది గాన వచ్చినాడవు, లేనిచో వచ్చెడివాడవా" అని తర్కించుట.

"ఆ లలన నాకంటే నీకంత యిష్టమైనదా" అని అసూయ.

"ఆమె కంటే నేనంత తక్కువ దాని నైతినా" అని రోషము, దైన్యము.

నాకంటె ఆ లలన యెందులో గొప్ప — —

గుణము, కులము, సౌందర్యము, విద్యయు అని తర్కించుటలో గర్వం.

"నా అంతటి గుణవతియా,

నా అంతటి శీలవతియా,

నా అంతటి సౌందర్యవతియా;" అని తర్కించుట.

"ఇన్ని వుండియూ నా జీవితం వృధాఅయ్యెనని" — శంక, శంకతోగూడిన దైన్యము.

"అవును యింతటివారు మీకెట్లు పనికివత్తురు. మీకు తగినది ఆ లలనయే — — " అని అపహాస్యము ఎత్తిపొడుచుట.

ఈ విధంగా అభినయించవలెను.

అలఋవిల్తుని కేళి - నలుముకొనుచు నన్ను

శ్రమ, సుప్తి, హర్షం, హాస్యం, కాముకేళి, ఆర్తి.

**కాముకేళి :** బంధనములు, ఆలింగన, చుంబన, దంతక్షత, నఖక్షతములు ప్రదర్శన.

**శ్రమ :** ప్రయాస, చెమట బిందువులు తుడుచుకొనుట, ఆయాసపడుట, అర్ధనిమీలిత నేత్రములు, నిట్టూర్పు — — వీనిని కనబర్చవలెను.

**సుప్తి :** నిద్రాభావము, దీర్ఘకాలము కదలికయుండుట, ఉఛ్వాస నిశ్వాసములు, కన్నులు మూతలు పడుట — — వీనిని ప్రదర్శించవలెను.

**ఆర్తి :** పులకరింపులు, సర్వాంగములు వణకుట, తాపము, కూజితము -- మొదలైనవి ప్రదర్శించవలెను.

కలిసిన పాపానికి - కన్నుల జూడవచ్చితివో ? ॥

వితర్కంతోగూడిన స్మృతి, శంక, విషాదం,

అసూయ, వితర్కం, శంక.

**కలియుట :** బంధవిశేషములు, సరస సల్లాపములు, కలాపములు, వినోద క్రీడలు - వీని అభినయములో "స్మృతి" ప్రదర్శిత మగును. వీటినన్నింటినీ స్మరణకు దెచ్చి, అతనితో తర్కించుటవల్ల — వితర్కభావములు ప్రదర్శితమగును.

పైన చెప్పినది స్వీయనాయికాభినయము :

పరకీయయందు - యింతటి భావాభినయముండదు. మరియు రౌద్రానికి అవకాశములేదు. గనుక భావప్రదర్శనలో యింతటి గంభీరత కన్పించదు. అతిశయము నణచుకొని, కొన్నివేళల దైన్యముతోగూడిన రోషము, విషాదంతోగూడిన ఈర్ష్య ఈ విధంగా భావప్రకటన యుండును. తానెంత అతని వలచినన్నూ, అతనింత

తనయెడల అనురాగమున్ననూ తాను యితరుల సొమ్ము — తనపై అతనికి సంపూర్ణ అధికారములేదు. అతని యెడల తనకు స్వేచ్ఛ లేదు. ఆ హద్దుల నెరిగి ప్రతిభావము ప్రదర్శితమగును, గనుక పూర్తిగా పదమంతటనూ ఒకవిధమైన దీనత్వము ప్రకటితమగుచునే వుండును.

ఇదియే ఈ రెండింటిలోనూ ముఖ్యమగు భేదము. ఈ గుర్తెరిగి ...ఈర్ష్యామాను విప్రలంబమును స్థాయిగా, మిగిలిన సంచారు లన్నింటినీ పై విధముననే అభినయించవలెను.

నాయిక — పరకీయ, పరోఢ.

నాయకుడు — శఠుడు.

ఈర్ష్యామాన విప్రలంబ శృంగారము.

సంచారి భావములు : స్మృతి, వితర్కం, శంక, చింత, దైన్యం, విషాదం, నిర్వేదం, అవహిత్థ, విషాదముతోగూడిన దైన్యం, దైన్యంతోగూడిన విషాదం, ఆవేశం, ధృతి, అధ్యావము, ఆర్తి, జాగు, ఉన్మాదము, ఈర్ష్య, బోధము, మతి, శ్రమ, సుప్తి, హర్షము, వితర్కంతోగూడిన స్మృతి, రతులు, శైత్యోప చారములు.

ప॥ ముందటివలె నాపై - నెనరున్నదా ...
స్మృతి, వితర్కం, దైన్యం
ముచ్చట నికనేలరా ॥
చింత, దైన్యం, విషాదం

అ॥ ఎందుకు మొగమిచ్చకపు మాటలాడేవు
వితర్కం, విషాదంగూడిన దైన్యం
అవహిత్థ, శంక.

ఏరా మా మువ్వగోపాల మేరగాదుర ॥

**వితర్కం, దైన్యంతోగూడిన విషాదం, వితర్కం.**

చ ॥ పిలువనంపినరావు – పిలిచినను గైకోవు

**ఔత్సుక్యం, విషాదం, వితర్కం, ఆవేగం, విషాదం.**

పలుమారు వేడిన – పలుకవు

**దైన్యంతోగూడిన విషాదం, ధృతి, విషాదం.**

వలపు నిలుపలేక – చెలుడనని నిన్నే

**ఔత్సుక్యం, నిర్వేదం, ధృతి, మతి.**

తలచి తలచి చాలా – తల్లడిల్లుచేగాని

**అధ్యానము, ఆర్తి, జాగు, శైత్యోపచారములు.**

చ ॥ చిన్ననాటి నుండి చేరిన దెంచక

**స్మృతి, మతి, వితర్కం, హర్షం, విషాదం.**

నన్ను చౌక జేసేది న్యాయమా

**వ్రీడ నిర్వేదం, నిర్వేదంతోగూడిన దైన్యం.**

వన్నెకాడ నీదు వంచన తెరుగన – –

**విషాదం, స్మృతి, వితర్కం**

నిన్నన బనిలేదు — నే జేసిన పూజకు ॥

**రోషం, ఈర్ష్య, మతి, నిర్వేదం, బోధము, విషాదం, దైన్యం.**

చ ॥ కలువల రేడంచు – కంచివరదా నిన్ను

**హర్షం, ధృతి, దైన్యం, మతి.**

లలన యింత దూరము రానిచ్చేనా

**ఈర్ష్య, రోషము, శంక, వితర్కం.**

అలరువిల్తుని కేళి నలుముకొనుచు నన్ను

**రతివిశేషములు, హర్షం, సుప్తిశ్రమ, మతి, హర్షం.**

కలిసిన పాపానికి – కనులజూడ వచ్చితివా

**స్మృతి, వితర్కం, ఈర్ష్య, వితర్కం, శంక.**

సంచారుల అభినయమును గూర్చిన వివరములు ముందుగా వ్రాసిన వ్యాఖ్యానములో తెల్పియున్నాను.

సుమారు 15 సంవత్సరముల క్రిందట All India Radio, New Delhi వారు భారతదేశ శాస్త్రీయ నృత్యరీతులుపై, ప్రముఖ కళావేత్తలచే ఉపన్యాసములు యేర్పాటుచేశారు. ఆ నర్తనరీతులు భరతనాట్యము, కథక్, కథకళి, మణిపురి నృత్యములు మాత్రమే. ఆ సమయంలో శ్రీ విస్సా అప్పారావుగారు — ఆంధ్రదేశంలో ఒక విశిష్ట భాగవత సంప్రదాయమున్నది. అదియే కూచిపూడి సంప్రదాయము ఆ సంప్రదాయముయొక్క స్వరూపమును దేశానికి యెరుకజేయుట అత్యవసరమని రేడియో వారితో చర్చించి, కూచిపూడిపై గూడా ప్రసంగము Broadcast చేసియున్నారు. కూచిపూడి నాట్యమనే ఒక భాగవత సంప్రదాయము ఆంధ్రలో వున్నదని యావద్భారతదేశానికి తెలియుట అదే మొదటిసారి . . .

ఆ సందర్భములో "ముందటివలె నాపై ... నెనరున్నదా సామి" భైరవి రాగము, త్రిపుట తాళములో శ్రీమతి ఇందువదన పాడగా ఆమె సోదరి శ్రీమతి వైదేహి మాకోరకు ప్రత్యేకంగా అభినయించినది, అటుపై శ్రీమతి జక్కుల నూకరాజు—పిఠాపురము, ఈ పదము నభినయించగా చూచియున్నాను. శ్రీమతి నూకరాజు గాత్ర సంగీతము శ్రీ వీణ సంగమేశ్వరశాస్త్రిగారు, శ్రీ వేమన దొరగారివద్దనూ, అభినయం తనతల్లి వద్దనూ అభ్యసించియున్నది . . . ఆమె అభినయమెంతటి ఉత్తమస్థాయిలో వుండినదో, పాటగూడా అంత చక్కని బాణి . . శ్రీమతి వైదేహి మా ప్రత్యేక కోరికపై ఆంగికమునకు యెక్కువ ప్రాధాన్యతనిస్తూ హస్తాభినయం పట్టినది. సాత్వికాన్ని గాత్రములో ఆమె సోదరి పూరించినది. శ్రీమతి నూకరాజు హస్తాలకు ప్రాముఖ్యతలేక కేవలం ముఖాభినయం ప్రద

రక్షించినది. కంఠంలో భావాన్ని పలికిస్తూ గానంచేయుట, ఆయా భావములను ఒప్పించుటకు, ధ్వనిలో సవరింపులు చక్కగ తెలిసిన నర్తకీమణి ఇందువదన - - ఆమె పాడితే అభినయమే అవసరము లేదనిపించేది - - మరియు అభినయించు నర్తకికి సహకారగానము ఏ విధంగా సహకరించవలెనో గుర్తెరిగి ఆమె గానం చేసేది.

తరువాత కొంతకాలానికి పిఠాపురం రాజావారి కోర్కెపై ఈ పదమును నేను వారికి అభినయించాను.

మదరాసులో సంగీత సభలందు "పదములు - సాత్త్విక అభినయము"పై ఉపన్యసించుటకు నేను శ్రీ అప్పారావుగారితో కలిసి వెళ్లినప్పుడు ఆ సభకు శ్రీ గిడుగు సీతాపతిగారుకూడా వచ్చారు. శ్రీ సీతాపతిగార్ని నేను కాలేజీలో చదువుకునే రోజుల్లో నాగపూర్‌లో వారు Oriental Conferenceకు వచ్చినప్పుడు కలిశాను. అటుపై అలంపురంలో ఆంధ్ర సారస్వత పరిషత్తు సభలందు కలిసినాను. వారు క్షేత్రయ్య పదములను వ్యాఖ్యానముతోచేర్చి పిఠాపురం రాజావారి కోర్కెపై అచ్చువేయుచున్నట్లు తెల్పారు. పదములు; అందలి సాహిత్యం, తాళముల పోకడలు, ఛందస్సు, సంగీతము, ఆంగిక సాత్త్విక అభినయములు వీటినిగూర్చి వారితో చర్చించే అవకాశము కల్గింది. నేను మదరాసు వెళ్ళినపుడు రాజావార్కి నా అభినయం చూపించాలనే అభిప్రాయంతో వారికి వినికిడి చేయగా - - వారి హోదాకు తగినరీతిని సన్మానించి, గౌరవించే పరిస్థితిలో కొంత యిబ్బంది రాజావారికి వుండునట్లు శ్రీ సీతాపతిగారు గ్రహించి నాకు తెల్పారు. శ్రీ రాజావారు కళాపోషకులు - ఆంధ్ర సారస్వతానికి యెంతో సేవజేసినవారు. వారి ముందు అభినయించుటయే ముఖ్యము, ధనముగాదని, నేను శ్రీ సీతాపతిగార్కి తెల్పినమీదట-ఒకరోజు ఉదయం శ్రీ అప్పారావుగారు, సీతాపతిగారు

నేనూ కలిసి రాజాగారి భవనానికి వెళ్ళాము. భవనం అడయారు నది నానుకొని వుంది మమ్మల్ని అతిథుల హాలులో కూర్చోబెట్టి శ్రీ సీతాపతిగారు లోపలికి వెళ్లారు. అరగంట అయిపోయింది.

"నటరాజ్. యిదే ప్రభువులలోని లోపం వారు తెల్పిన సమయానికి మనం వచ్చినా యింకా యెందుకో యిలా తాత్సారం చేస్తారు. యిలాంటి నిరీక్షణ చాలా బాధాకరమైంది"... అని అప్పారావుగారు నాతో అనిన కొన్ని నిమిషాలకు శ్రీ రాజావారు అక్కడకు వచ్చారు వెంట సీతాపతిగారు ఉన్నారు. అప్పుడే స్నానాదులు ముగించారేమో మెరుగుపెట్టిన నల్లరాతి విగ్రహంలా వారి వర్చస్సు మెరిసిపోతోంది

వారు వచ్చి కూర్చున్నారు, తరువాత వెంటనే, "పదాలు చక్కగా పాడతావూ అభినయిస్తావన్ని మా సీతాపతి చెప్పారు. వినిపించవయ్యా - - " మేము అనుకున్న సమయానికి వెళ్ళినా రాజాగారు ఆలస్యముగా దర్శనమివ్వడం, శ్రీ అప్పారావుగారి మాటలు నా మనస్సులో మెదలుతూ వున్నవి. వారిని కాస్త చిలిపిగా ఆడించాలనే కోర్కెగల్గింది. వెంటనే నేను ...

ఎంత చక్కనివాడే నా సామి వీ
డెంత చక్కని వాడే
ఇంతి ! మువ్వగోపాలుడు
సంతతము నా మదికి సంతోషము చేసెనే ॥
మొలక నవ్వులవాడే ముద్దుమాటల వాడే
తళుకారు చెక్కుటద్దముల వాడే ॥
ఈ పదము నింతవరకూ పాడి, వెంటనే ...
ఎందు దాచుకొందు నిన్ను

ఏమిసేతు నేను
అందమైన నీ మోము అయ్యాలూ
ముద్దు గుల్కుచున్నది ... ...
ఈ పల్లవి అనుపల్లవి నభినయించి
పిలువ నంపినరావూ
పిలిచి నను గైకోవూ
పలుమారు వేడితే
పలుకవూ
వలపు నిలుపలేక
చెలుడవని నిన్నే
తలచి తలచి చాలా
తల్లడిల్లుచేగాని ... ...
ముందటివలె నాపై నెనరున్నదా సామి

ముచ్చటలిక నేలర ? ...... ఈ అభినయంతో ముగించాను.

రాజావారు కొన్ని నిమిషాలు అలాగే చూస్తూ వుండి పోయారు. అటుపై "ఈ కంఠమెలా వచ్చిందయ్యా... ఈ అభినయ మెలా అబ్బింది. చాలా సంతోషం కలిగింది" తమ ఆనందం వెలి బుచ్చారు.. ఆనాటి సాయంత్రం కొందరు ప్రముఖ కళాకారులు, కళావేత్తల నాహ్వానించి సభనేర్పాటు చేస్తున్నట్లు అందు నా అభి నయం ప్రదర్శించవలెనని కోరారు.

తిరిగివచ్చేశాము. హోటలు గదిలో నన్ను వదలుతూ శ్రీ అప్పారావుగారు ఈ విధంగా అన్నారు:

"నటరాజ ... ముందటివలె నాపై — నీవు పాడింది పదం గదూ !

"మీరెప్పుడు ఏదో ఒకటి విమర్శిస్తూనే వుంటారు".

నేనుగాకుంటే యింకెవ్వరు విమర్శిస్తారోయ్ - పదము అభినయించేటప్పుడు, అభినయించేవారిపై ప్రేక్షకుల మనస్సు లగ్నమై పాటమీద ధ్యానముంచరు. పాటనూ, అభినయమునూ విడదీసి వేరు వేరుగా నేను చూస్తాను గనుక నీ అభినయమంత ఉత్తమస్థాయిలో పాట వుండాలని కోరుతున్నాను, అని తెల్పి వెళ్ళిపోయారు.

ఆ క్షణములో నాకు బాధ కల్గింది కాని పెద్దవారు. వారితో కలిసి వచ్చాను. అందువల్ల మారుమాటాడక వూరుకున్నాను. ఇంటికి తిరిగి వచ్చిన తరువాత ఒక నెలరోజులు ఆ పదాన్ని పట్టుదలతో సాధనచేశాను. అప్పుడు వారి మాటల్లోని సత్యాన్ని గ్రహించాను.

ఈ పదముపై అభినయ వ్యాఖ్యానము వ్రాసినప్పుడు, నా అభినయం వారు చూశారు. నాల్గుసార్లు త్రిప్పి వ్రాయించారు. ప్రతి పర్యాయము వారికి తృప్తి గల్గలేదని.........

"మాది పెద్దాపురము సంస్థానము. నా చిన్నతనములో విద్వాంసురాండ్రైన నర్తకినులు యెందరో యీ పదాన్ని అచ్చట అభినయించగా చూచినాను. ఆ అభినయము నాకు నేటికీ కన్నులకు కట్టినట్లుంది. ఆ స్థాయికి సరిపోవాలి మన వ్యాఖ్యానం అని ప్రతి సారి పంపేసేవారు. ఆఖరికి ఐదవసారి సంతృప్తిపడ్డారు. ఆ విధంగా రచన చేసినట్టిది ఈ పదానికి వ్యాఖ్యానం.

# అయ్యయ్యో వెగటాయెనే ..

నాదనామక్రియ – త్రిపుట

ప. అయ్యయ్యో వెగటాయెనే – నా సామికి॥

అ. పయ్యెద మీద జేర – పవ్వళించి యుండే సామికి॥

చ. ఢిల్లదీ నా మోము రెప్ప – వేయక కనుగొన
కలయ నిండు సంజచీకటి గమ్మితె
కలికి నీ ముద్దు మోము గానరాక యుండునని
తెలిపి ప్రొద్దుండగానే దీపము దెమ్మనే సామికి॥

ననబోడి! వినుమమ్మ నాపై చాల ప్రేమచే
తన దంతమున నా యధరము నొక్కి,
మొనసిమాటాడితే మోవి విడవ వలెనని
యనువచే సైగలాడుచున్న సామికి॥

మదిరాక్షి! వినుమమ్మ మా మువ్వగోపాలుడు
నిదురించిన గౌగిలి వదలీనని
పందిరి శయ్యమీది దుప్పటి కొంగులు నాలుగు
ముదముతో గట్టిగా ముడిగొను మను సామికి॥

నాయిక - స్వీయ, విరహోత్కంఠిత, ప్రౌఢ
నాయకుడు - శఠుడు

విరహ విప్రలంభ శృంగారము, కరుణ రసము, అద్భుత రసము.

సఖి - పార్శ్వచారిణి

సంచారులు :—దైన్యము, ఆలస్యము, అధ్యానము, వితర్కము, విషాదము, నిద్ర, ధృతి.

ప. అయ్యయ్యో వెగటాయెనే నా సామికి ॥
దైన్యం అధ్యానము వితర్కం విషాదం

దైన్యము:— దీనత్వము:— ముఖమందు కన్నులందు పేదరికము, కన్నీరు, స్తంభము, పెదవులందు వణకు, ముఖము కుంచుకొనిపోవుట, మనసు వ్యాకుల పడుట.

అధ్యానము :— ప్రియమైన వస్తువు లభించినప్పుడు కలిగే చింత - తాపము, నిట్టూర్పు, నిశ్వాసలు అభినయించవలెను.

వితర్కము : సంశయము, సందేహమువల్ల అనేక విధములుగా ఊహించుకొనుట.

ఆలోచించుచున్నట్లు కనబర్చుట.

'వితర్కము' యిచ్చట కరుణరసము, అద్భుతరసముల ఆధారముగా రెండు విధాలుగా అభినయించవలెను.

"అయ్యయ్యో వెగటాయనా"

వెగటాయనా :—కరుణ ప్రాధాన్యంగా అభినయించిన నిరాశ, నిస్పృహ, కన్నీరు మొదలైన భావముల నభినయించవలెను.

వెగటాయెనా - నే వెగటైపోతినా - అని ఆశ్చర్యం ప్రదర్శించి నపుడు - కనుబొమల నెగురవేయుట, బొమముడి, తలను ఆడించుట మొదలైనవి పట్టవలెను.

విషాదము :—ఏమితోచక చింతించుట, చేతులు పిసుకుకొనుట, ముఖమున దీనత్వము కనబరచుట, నిట్టూర్పు.

అ. పయ్యెద మీదజేరి పవ్వళించి యుండే సామికి॥
దైన్యం, విషాదం అధ్యానము, వితర్కం

దైన్యం, విషాదం, అధ్యానము - పల్లవి నందువలెనే అభినయించవలెను.

వితర్కం నందు కరుణ ప్రాధాన్యత జూపిన జాలును.
"పవ్వళించి యుండే సామికి"

ఇచ్చట సుప్తిలోని కొన్ని భావములు:— నిమీలిత నేత్రాలూ, బరువెక్కిన కనురెప్పలు, భారమైన దేహము, స్తబ్దత, ఆవలింత, కనులు పూర్తిగా మూతబడుట అభినయించవలెను.

చ. వెలది నా మోము రెప్ప - వేయక కనుగొన.
హర్షం హర్షం
కలయ నిండు సంజ చీకటి గ్రమ్మితే
దైన్యం ధృతి

హర్షం:—ప్రీతికరమైన పదార్థము లభించుటవల్ల కలిగే సంతోషమే హర్షం, లేక ముదము. స్వేదము, పులకాంకితము సాత్వికములు. ప్రియ సంగమమువల్ల కలిగే మనోవికాసము.

వికసించిన నేత్రములు
పులకాంకితము
ప్రీతికరమైన సంభాషణ

తన్మయ భావము:—వీని వలన ఈ సంచారి నభినయించవలెను.

"నా మోము రెప్పవేయక కనుగొన"

పట్టవలసిన ఆంగికము

నాయిక శిరమును తన కరములోనికి గొని 'అలపల్లవ' హస్తము పట్టి నాయిక ముఖమును అందునిరూపించి—

నేత్రములతో రెప్పనార్పక ఆ ముఖమును జూచుట.
నేత్రములలో కాంతిని ప్రదర్శించుట.
ఆనందాశ్రువులలో నేత్రములు ప్రకాశింపజేయుట.
పెదవుల కదలికతో మందహాసము కనబర్చుట.
పెదవుల వణకుతో తన్మయత్వము ప్రదర్శించుట.

రెండవ చేతితో ముంగురులు సవరించినట్లు, చెక్కిలి నొక్కినట్లు, చుబుకము స్పృశించినట్లు, పెదవులను వేళ్ళతో తాకి గిలిగింతలు పెట్టినట్లు-బుగ్గపై చిటికె వేసినట్లు, చెక్కిళ్ళను కొనగోర్లతో తాకినట్లు, కన్నులలోనికి జూచినట్లు, మోమును మోమున జేర్చినట్లు ఇట్టి విధములైన శృంగారచేష్టలు అభినయించవలెను.

దైన్యం - ధృతి.
దైన్యము - దీనత్వం : ధృతి - ధైర్యము.

ఈ రెండు సంచారులను ప్రక్క ప్రక్కనే అభినయించుట వల్ల - అభినయము మరింత వికాసవంతమగుచున్నది. నిండు సంజచీకటి గ్రమ్మెట - ఆపుట నాయకునికి శక్యముగాదు. చీకటిగ్రమ్మిన నాయిక మోమును కనుగొన శక్యముగాదు. ప్రకృతి సహజమైన చీకటి ఆపుటలో అతని అసహాయస్థితి - ఈ స్థితిని అభినయించుటయే దైన్యము.

కాని ఆ చీకటిని జయించుటకు ఉపాయము వెదకుట, చీకటి పడకముందే మేల్కొనుట.

ఈ స్థితియే ధృతి - అనగా ధైర్యమును గోల్పోక ఆ చీకటిని జయించే అవకాశములను కల్పించుకొనుట 'ధృతి'లో ప్రదర్శిత మవు చున్నది.

ఈ రెండు సంచారులను ఒకదాని తరువాత ఒకటి వేరుగా అభినయించి, పిదప రెండింటినీ చేర్చి అభినయించిన అభినయము రక్తి వంతంగా రూపొందును.

'కలికీ నీ ముద్దుమోము గానరాక యుండు'నని నాయకుని వాక్యమును ముందు అభినయించవలెను. ఇందు పురుషాభినయము ప్రదర్శితము గావలెను.

ఆంగికము—

'కలికీ నీ ముద్దుమోము - గానరాక యుండునని
విషాదం ధృతి, ఆలస్యం

తెలిసి ప్రొద్దుండగానే - దీపము దెమ్మనే సామికి॥
ఆలస్యం, విషాదం దైన్యం. వితర్కం,
అధ్యానం

విషాదం:—ఆరంభించిన పని సాగకుండుటవల్ల కలిగే మనస్సంతాపము. ఇష్ట పదార్థప్రాప్తికి విపత్తు కల్గుట విషాదము.

ఏమిచేయవలెనో తోచకుండుట యోచించుట.

విచారము ముఖమున వెల్లడించుట.

నిట్టూర్పు, ఉత్సాహము లేకయుండుట-వీని వలన విషాదము కనబరచి వెంటనే 'ధృతి'—ధైర్యమును ప్రదర్శించవలెను.

ఆలస్యం :— ఈ ఆలస్యములో కేవలము మాంద్యము, జాగు కల్గించే భావముల నభినయించుట విశేషముగాదు. ఈ ఆలస్యాభినయములో ఆవేగము ప్రదర్శితమగునట్లు సూచనలుండవలెను.
అదెట్లన —

గర్వము. భయములేకయుండుట తృప్తి వీనివలన పనులు చేయుటలో కలిగే అలసత్వము, ఆలస్యము.

కనుక యీ 'జాగు'ను అభినయించినప్పుడు కేవలము
బద్ధకము కనబర్చుట —
ఆవలింతలు.

నేత్రములు మూతలు పడుట మొదలైనవి గాక త్వరపడుట వల్ల —

ఏమి తోచకుండుట -
తోచకుండుటవల్ల స్తబ్దత
స్తబ్దతవల్ల ఏ పని చేయలేక పోవుట.

ఆ స్థితివల్ల జాగు - ఆ జాగువల్ల ఆవేదన ఈవిధముగా అభినయము వృద్ధిపొందును. ఈ అభినయము విశిష్టరీతికి చెందినట్టిది. ఈ అభినయమే, సాత్విక వికాసానికి ఉపయోగపడును.

మరొక్క-రీతి —
ఆలస్యం — విషాదం

ఆలస్యంవల్ల "విషాదం" నభినయించుట. జాగుచేయుటవల్ల కలిగే నష్టము ఆ నష్టమువల్ల కలిగే విషాదము —

ఈ విధముగా ఈ రెండు సంచారులను చేర్చి అభినయించవచ్చును.

మిగిలిన సంచారులను యథారీతి నభినయించవలెను.

కొందరు పెద్దలు — ఇచ్చట.

జాగు : జాగులో ఆవేగము, ఔత్సుక్యము ప్రదర్శించి, మరియూ విషాదమునుచేర్చి ప్రదర్శించి ముగించుటగూడా వున్నది. కాని యిది చాలాకష్టమైన రీతికి చెందినట్టిది. బహుకొద్దిమందికే సాధ్యమైనట్టిది.

ఆవేగమువల్ల "జాగు".

అతి తొందరపాటువల్ల మనస్సున కేమి తోచకుండుట. కాని ఏదో ఒకటి చేయవలెనని మనస్సు ఉత్సాహంతో ఉపాయముల వెదకుట, అందువల్ల యెట్టి ఫలమూ సిద్ధించక కాలము గడిచిపోవుట. అందువల్ల నిరుత్సాహము, ఆ నిరుత్సాహమువల్ల అలసత్వము—

ఈ విధంగా భావములను పెంచి, పోషించి అభినయించుట.

ఈ రీతి అరుదుగా ప్రచారంలో వున్నది.

చ. వనబోడి ! వినవమ్మ — నాపై చాలప్రేమచే
దైన్యం అధ్యానము
తన దంతమున నా యధరము నొక్కి
దైన్యము మోహం, విషాదం

దైన్యం : ముఖమందు, నేత్రములందు పేదరికము. జాలిని గొల్పే స్వరము.

అధ్యానము : నిట్టూర్పు, తాపము.

మోహం : ఆనందంచే మూర్ఛిల్లుట (ఆ తలంపు గల్గిన అవస్థ) నాయకుడుచేసిన శృంగారచేష్టను స్మరించుకొని నంతనే మనస్సు పరవశమై స్పృహతప్పుట —

అభినయ రీతి : నిద్రజెందినట్లుండుట, కన్నులు మూతలు పడుట, ఇంద్రియములు పట్లు తప్పుట. స్తంభము వీనివలన ప్రదర్శించనగును.

మొనసి మాటాడితే — మోవి విడువవలెనని
విషాదం వితర్కం
యనువచే సైగ—లాడుచున్న సామికి
హర్షం వితర్కం ఆలస్యం, దైన్యం.

విషాదం : ఇచ్చట పదార్థ ప్రాప్తికి భంగము వాటిల్లుననే భ్రమవల్ల విషాదము కల్గుచున్నది.

ఏమి చేయవలెనని యోచించుట.
ముఖమున విచారముతో అభినయించవలెను.

వితర్కము : సంశయము, సందేహము — తల యాడించుట, కనుబొమల నెగురవేయుట, బొమముడి వీనివల్ల సంశయమును అభినయించి అటుపై — నివృత్తిగా —

తలను ఉన్నచోటునుండి కదల్చక యుంచుట.
నేత్రములందు ప్రసన్నత —
ముఖమందు ప్రశాంతత కనబర్చవలెను.
మరియూ,
హర్షం — అభినయములో —

ఉత్సాహము, పులకలు పుట్టుట, శరీరముప్పొంగుట. వీటిని ప్రదర్శించిన 'వితర్కం'ను మరింత వికసింపబడును.

వితర్కం, ఆలస్యం, దైన్యం — పూర్వమువలెనే అభినయించవలెను. ప్రత్యేకత లేదు.

చ. మదిరాక్షి, వినవమ్మ ! మా మువ్వగోపాలుడు
దైన్యం
నిదురించిన గొగిలి - వదలీనని
నిద్ర, వితర్కం, మోహం, విషాదం, చింత.

నిద్ర : శరీరము విరచుకొనుట, ఆవలించుట, కన్నులు మూతలు పడుట.

చేష్టలు లేమి—వీనివలన నిద్రను ప్రదర్శించవలెను.
కౌగిలి : ఆలింగనా రీతులు—

వితర్కం — సందేహము ; అందు మోహము ప్రదర్శించి, నిట్టూర్పు, తాపములతో చింతను ప్రకటించవలెను.

పందిరి శయ్యమీది దుప్పటి కొంగులు నాలుగు
విషాదం, చింత విషాదం

ముదముతో గట్టిగా - ముడిగొను మనుసామికి ॥
ముదము - ధృతి దైన్యం చింత
ముదము : సంతోషము —

ముఖమునందు ఆనందం

నేత్రములందు వికాసము

ప్రియభాషణము

పులకలు పుట్టుట

శరీరము పొంగుట

చేతులు తట్టుట - వీనిని ప్రదర్శించి.

ధృతి : ధైర్యము, సంతోషముతో, నిశ్చలమైన మనస్సు (అనగా తడబాటు, తొట్రుబాటు, లేకయుండుట)తో, ప్రశాంతమైన ముఖముతో ప్రదర్శించవలెను.

ఈ పదమును అభినయించునప్పుడు -

విప్రలంభ శృంగారం, కరుణరసం, అద్భుతరసం వీటిని చేర్చి అభినయించుట సాధారణముగా ప్రచారములో ఉన్నది.

మా గురువుగారు శ్రీమతి రాజమ్మగారు, విప్రలంభమును వేరుపరచి, ఒక్కొక్క రసమునకే ప్రాధాన్యతనిచ్చి అభినయించగా ఒక్కసారి నేను చూచి యున్నాను. అందు ఆఖరిలో అద్భుతరసానికి ప్రాధాన్యతనిచ్చి ప్రదర్శించిన అభినయం అతిరమణీయంగా ఉండినది. ఇందులో సంచారుల ప్రదర్శనలో కొంత మార్పుండును. దైన్యం, విషాదం, చింత - వంటి సంచారులకు అందు తావుండదు. శంక, వితర్కం, ధృతి, అధ్యానము, ఆవేదము, ఔత్సుక్యము యిత్యాది సంచారులు ప్రాముఖ్యత వహించును.

ఆంధ్రదేశంలో నాయకురాలైన ప్రతి నర్తకీమణీ యెక్కువగా అభిమానించి అభినయించిన పదమిది.

కొన్ని సంవత్సరముల క్రిందట మదరాసులో సంగీత సభల్లో వృద్ధ కళాకారిణి, అభినయ సరస్వతి శ్రీమతి మైలాపూరి గౌరిదేవి ఈ పదము నభినయించగా చూచేను. శ్రీమతి గౌరిదేవి డెబ్బది సంవత్సరాల వృద్ధురాలు. ప్రస్తుత కాలంలో దక్షిణాదివారిలో అంతటి గొప్ప అభినయ కళావేత్త మరొకరు లేరు. ప్రసిద్ధులైన ఎందరో కళాకారులు ఆమెవద్ద అభినయం అభ్యసించి లక్షలు ఆర్జించినా, ఆమెకు మాత్రం పూర్తిగా సరస్వతీ కటాక్షముండుటచే, లక్ష్మి ఆమె చెంతకు చేరలేదు. వృద్ధాప్యంలో ఎన్నో ఆర్థిక యిబ్బం దులకు లోనై బాధలు పడుతున్నా, అభినయ సమయంలో ఆ బాధ లన్నీ మరచి, వృద్ధాప్యాన్ని జయించి, పదహారు సంవత్సరాల, జవ్వనియైపోయేది. ఆమె భావ ప్రదర్శన చేస్తుంటే చూడవలసిందే గాని వర్ణించలేము.

ఆ తరువాత అఖిల భారత నాట్యోత్సవాలు హైదరాబాదులో జరిగినప్పుడు శ్రీమతి తంజావూరు బాలసరస్వతి ఈ పదము నభిన యించినది. ఈమె గౌరీదేవి వద్ద పదాభినయం అభ్యాసం చేసిన ప్రసిద్ధ నర్తకీమణి. ఆట మాత్రం కంజీవరం బాణీ—

"వెలది నా మోము రెప్ప—వేయక కనుగొన"

ఈ చరణంలోని సాహిత్యానికి ఆమె ప్రదర్శించిన అభినయం నేటికీ మరువలేను.

మోకాళ్ళపై మండె కూర్చొని—ఎడమచేత అల పద్మ హస్తము పట్టి-తాను ప్రియుడై ప్రేయసి ముఖము; తన వామ హస్తంలో తిలకించుతూ ప్రకటించిన భావపరంపర రమణీయము ప్రేయసి ముఖమును జూస్తూ అలాగే వుండిపోయినప్పుడు ప్రియుడు పొందే అనుభూతులు. నేత్రముల ద్వారా పెదవుల కదలిక ద్వారా, శిరస్సు, గ్రీవముల యొక్క చలనముల ద్వారా ఎంతో ముచ్చటగా ఆయా పురుష భావములు ప్రదర్శించినది.

ఏలూరులో శ్రీమతి చదలవాడ సామ్రాజ్యం అనే ఒక వృద్ధ కళాకారిణి ఉన్నారు. ఆమె శ్రీమతి చాటపర్రు సుందరి, పువ్వుల పాపాచలం, దుగ్గిరాల మాణిక్యం మొదలైన ప్రసిద్ధ కళావేత్తల సమకాలికురాలు. ఆమెను ఒకసారి కలిసినప్పుడు అభినయము గూర్చి కొన్ని విషయాలు ప్రసంగములో తెల్పినారు.

దక్షిణాదివారిది తీరె మోలు ఆట—పదార్థాభినయము, విశే షాభినయము వారి విద్యలో తక్కువ. మన ప్రాంతంలోని నాయకు రాండ్రు ప్రారంభంలో ప్రతి మాటకు పదార్థాభినయము, విశేషాభి నయములూ చిత్రాభినయమును వివరించి, ప్రదర్శించి పిమ్మట సాత్వి కాన్ని ప్రదర్శించేవారు. ఆమె ప్రదర్శనాలిచ్చే సమయంలో దక్షిణాది

వారి ప్రదర్శనాలు చూచే అవకాశం కల్గిందట. వారి అభినయము కంటే వారి పాట బాగుందట. అభినయమనిన ఆంధ్రులదే—అని ఆమె అభిప్రాయపడినది. శ్రీమతి సామ్రాజ్యం వయస్సు డెభ్భది దాటి ఉంటుంది. అంత వృద్ధాప్యంలో గూడా ఆమె అభినయం గూర్చి మాట్లాడుతుంటే ఒక ప్రత్యేకమైన తేజస్సుతో, ఆమె విశాలమైన నేత్రాలు ప్రకాశిస్తుంటాయి. ఎన్నో భావాలు, ఆ నేత్రాల్లో పలుకుతుంటాయి. ఆ సాధన యెట్టిదో, ఎంతో కాలం క్రిందట, ఆనాటి విచిత్ర సాంఘిక పరిస్థితుల్లో నిరుత్సాహపడి విద్యను విరమించిననూ నేటికీ ఆమె ముఖంలో ఆ భావ పరంపర మనకు గోచరమవుతూ వుంటుంది. కర్నాటకము బాగా నెరిగిన వృద్ధ కళాకారులలో ఆమె ఒకరు మిగిలినారు.

అభినయ విద్యకు సరస్వతీ పీఠముగా ప్రసిద్ధి గాంచినది మండపేట. అచ్చట యెందరో వృద్ధులైన కళావేత్తలు భరతనాట్యము, భాగవతరీతి నెరిగిన వారున్నారు. ఆ ఊరులోని కళారీతుల దర్శించడానికి శ్రీ అల్లంరాజు సుందరంగారితో కలిసి వెళ్లాను. అచట చాలా వృద్ధులైన ఒక కళామూర్తిని కలిశాను. తల పూర్తిగా నెరిసిపోయి, ముఖము ముడతలుపడి, నేత్రముల దృష్టి సరిగా ఆనని స్థితి ఆమెది. అభినయశాస్త్రములో ఆమె ప్రసిద్ధురాలు. ఆమెను కలిసినప్పుడు ఈ పదము నభినయించమని కోరగా, ఆమె పల్లవి అను పల్లవి కొంత తడువు అభినయించి—

"బాబూ! వృద్ధాప్యం శత్రువై నన్ను పీడిస్తోంది. ఎక్కువ సమయం నేను భావం పట్టలేను. నా వద్ద విద్య నభ్యసించిన శిష్యురాలు కుమార్తె ఈ ఊరులో వచ్చి వుంది. ఆ జవ్వనిచేత అభినయింప చేస్తాను. రేపటిరోజు దర్శన మిప్పించండి" అని తెల్పింది. ఆ మరునాడు మేము వెళ్ళగా, మొదటిలో ఆ యువతి, భయపడి

అభినయించక వెళ్ళిపోయింది. మాకు చాలా నిరుత్సాహము గల్గింది. కాని ఆ రోజు మధ్యాహ్నం మరల ఆమె కబురంపగ వెళ్ళాము. ఆ జవ్వని వయస్సు పదునెనిమిది సంవత్సరాలుండును. చక్కని అవయవ సౌష్టవం, అభినయానికి విశాల నేత్రాలు, ఆమె కూర్చొని ఈ పదానికి భావం పట్టింది.

ఏదో మన ఊహలకందని బాధ, హృదయాంతరాళాలలో దాగియున్న ఆవేదన, పరులకు తెల్పుకోలేని దుఃఖము, తెల్పిననూ ఆ ఆవేదనను యితరులు తీర్చలేరనే నిరాశ, నిస్పృహ, దీనత్వము, ఆశించిన అంతస్తులు అందుకోలేదని బాధ ఆమె అభినయములో గోచరించాయి. అది అభినయమా? లేక ఆమె హృదయం పొందుతున్న తపనయా? ఆ విధంగా భ్రమింపజేసింది. ఆ అభినయంలోని విశిష్టత, నేటి కాలంలో ప్రసిద్ధులమని పేరుగాంచి ప్రదర్శనాలిస్తున్న ఏ కళాకారుల్లో గూడా అంతటి ఉత్తమ కళా వికాసము గాంచలేము.

ఆమె అభినయము జూచి తిరిగి మా బసకు వచ్చేస్తూ ఆమెకు బహుమానంగా కొంత ధనం ఇవ్వబోయాను.

"బాబూ నాకు డబ్బు వద్దండీ—మీవంటి పెద్దల ముందు ప్రదర్శించాను, అదే పదివేలు. కాని మా విద్యకు విలువ లేదండి-అడవి గాచిన వెన్నెల—"ఆమె కన్నులు అశ్రువులతో నిండినవి.

చాలా కాలం ఆ దృశ్యాన్ని మరిచిపోలేకపోయాను. ఒకసారి ఆ యువతి వుండే ఊరు వెళ్లినప్పుడు ఆమె కళను దర్శించాలని కబురు చేయగా—

"ఆమె ఒక ధనవంతుని పోషణలోకి వెళ్ళింది. ఆమెను చూచే అవకాశం లేదని" వెళ్ళిన వ్యక్తి ఈ సమాధానం తెచ్చాడు.

ఆ రోజున నా హృదయం పొందిన బాధ అతీతం. సంపూర్ణమైన కళావికాసం కల్గిన యెందరో కళావేతలు ఈనాడు గూఢా

ాన్ని సాంఘిక, ఆర్థిక యిబ్బందులకు లోనై, మారుమూల ప్రదే
ంల్లో మ్రగ్గిపోతూ, ఎవరిచే గుర్తింపబడక కాలవాహినిలో కలిసి
ోతున్నారు. ఆ కళారీతి వారితోనే అదృశ్యమైపోతుంది. విద్య
ోతుల నెరగకపోయినా ప్రచార సాధన సంపత్తి గల్గినవారు
ప్రసిద్ధులుగా చలామణి అవుతున్నారు సంఘంలో-కనుకనే ఉత్తమ
స్థాయిలో కళా సంప్రదాయములు ప్రచారంలోనికి రావడం లేదు.
ాస్త్ర సంప్రదాయముల విశిష్టత నెరుగని కళాభిమానులు అదే
ద్యగా అభిమానిస్తున్నారు. అభినయ విద్య సహజ సౌకుమార్యం,
ౌందర్యంతో ప్రదర్శించవలెనన్న కేవలం గురువు వద్ద విద్య నభ్య
ంచినంతటితో సరిపోదు. కళాకారులలో మనోధర్మము వృద్ధి చెంద
ాలెను. మనోధర్మ వికాసానికి సంప్రదాయ విద్యాభ్యాసంతోపాటు
ాస్త్రవిజ్ఞానము, భాషాపాండిత్యము అవసరం. సంగీత సాధన అత్య
వసరము. కాని మన దేశంలో నేటి కాలంలో కళల దురదృష్టమే
ునగా కళాకారులెక్కువైనారు. సర్వమూ నెరిగి అభినయించే కళా
వేత్తలు అరుదైనారు.

# "ఎటువంటి వాడే వాడు"

నాయిక—ప్రౌఢ, సామాన్య.

నాయకుడు-దక్షిణుడు; అందరి నాయికలయందు సమాన అనురాగము కలవాడు.

శృంగార, అద్భుత రసములు.

సంచారులు :-శంక, వితర్కం, దైన్యం, ఆవేగము, హర్షము, ధృతి, విషాదము, ఔత్సుక్యము, మోహము, చాపలము, లజ్జ, భ్రమ.

ఈ పద మందంతటనూ అచ్చటచ్చట సమయానుకూలంగా చాపలము, భ్రమ నభినయించిన చూడముచ్చటగా నుండును. ప్రేమ వల్లగాని, ద్వేషమువల్లగాని పుట్టిన మనోవికారములే చాపలత్వము.

ఇందు చెలులతో ముచ్చటగా మాట్లాడుట దృష్టియందు చంచలత్వము.

విలాసమైన చిరునవ్వు నవ్వుట—అభినయించవచ్చును. భ్రమ యందు.

నృత్త నృత్య గీతములును మొదలైనవి జేయుట—నిలకడ లేక వుండుట.

నృత్తము ఈ పదములో ప్రతి చరణాంతమందు ప్రదర్శించిన బాగుండును-వయ్యారపు నడక, నిలకడలేని చూపు ఈ నాయికకు శోభించును. ఇతర పదములందువలేగాక ఈ నాయిక అభినయమందు కొన్నివేళల నృత్యము గూడా ప్రదర్శించవచ్చును. రసభంగము గాదు. ఈ పదాభినయం ప్రియ శ్రవణా వేగముతో ప్రారంభించ వచ్చును.

ఇష్ట అయిష్ట జ్ఞానమువల్ల పుట్టిన భ్రమతో చేరిన దురుసు తనమే ఆవేగము - తొందరపాటు.

(ఒక కంటికే కాటుక, ఒక కాలికే పారాణి, అలంకారములను నగలను వ్యత్యాసముగా ధరించుట మొదలైనవి).

**నీలాంబరి - త్రిపుట**

ఎటువంటి వాడే? వాడూ-ఓ యమ్మ-వాడెన్నడు నీ వీధిని రాడూ

| శంక | వితర్కం | ధృతి | హర్షం | దైన్యం |
|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 |

(1) శంక:— మాటి మాటికి పార్శ్వముల జూచుట, ముసుకిడుట, సందేహించుట, నేత్రములందు చపలత్వము, రెప్పల నార్పుట (త్వరితగతిని).

(2) వితర్కం :— (సందేహమువల్ల అనేక విధములుగా తలచుట-వితర్కం). కనుబొమల నెగురవేయుట, బొమ ముడి, తల యాడించుట, కనుబొమల నెత్తుట, తల ముందుకు ఆడించుట, ఆలోచించునట్లు కన బడుట, సంశయ నివారణమైనట్లు చప్పట్లు చరచుట.

(3) ధృతి :— సంతోషము కనబర్చవలెను.

(4) హర్షం :— (ఉత్సాహము లేక మనోవికాసము). ముఖ, నేత్రములందు వికాసము, పులకరింపు, స్వేదము, శరీర ముప్పొంగుట, నేత్రములు బరువుగా మూతలు పడుట.

(5) దైన్యం :— ముఖమందు పేదరికము, విసుగుదల, ఆతృత, ఆశాభంగము, నిరాశ, కోరికతోకూడిన నిట్టూర్పు.

కుటిల కుంతలి! మువ్వ-గోపాలుడట పేరు

**ఔత్సుక్యం** **హర్షం**

ఔత్సుక్యం :— ఉత్సాహము సంతాపము నిట్టూర్పు శరీరభారము తొందరపాటు.

* * * *

I. నల్లని మేనివాడట ఓ యమ్మ! వాడు-నయము లెన్నో చేసునట!

**శంక** **హర్షం** **వితర్కం**

చల్లగా మాటాడునట !-సరసము వాని సొమ్మట

**హర్షం** **ఔత్సుక్యం,** **ధృతి**

కల్ల గాదట వాడు-కళలంట నేర్చునట !

**ధృతి** **హర్షం** **మోహం** **వితర్కం**

**సాత్వికము**

**మోహం**

నిద్ర జెందినట్లు కనులు మూసుకొనుట

నిమీలిత నేత్రాలు

శరీరము కంపించుట్లు

సంతోషము పట్టలేక శరీరమును మరచిపోవుట
కాలు చేతులు మొదలైనవి ఒక్కటొక్కటే కదిలించుట.
లేక శరీరము కంపించుట, పులకాంకితము.

కళా స్థానములు :—

బొటనవ్రేలు, కాలి మడమ, పిక్క, తొడ, పిరుదు, బొడ్డు, భుజము, కుచము, చంక, చెవి, చెక్కిలి, పళ్లు, ముక్కు, రొమ్ము, ముఖము, తల.

ఈ స్థానముల కళ స్త్రీలకు శుక్లపక్షమున ఎడమ ప్రక్కగా నెక్కి, కృష్ణపక్షమందు కుడి దిక్కుగా దిగును.

—(కళాశాస్త్ర ప్రమాణము)

కళా స్థానముల నభినయించినప్పుడు :—

పూర్వము :-అభినయించే రోజు తిథి వారనక్షత్రాలు గుర్తించుకొని వానిననుసరించి-అభినయించేవారు.

మరియూ పద్మిని, హస్తిని, చిత్రిని, శంకిని జాతులననుసరించి మార్పులు గూడా చూపించుతూ అభినయించేవారు. ఈ విషయం మా పూజ్య గురువుగారైన కాళహస్తి రాజమ్మగారు చెప్పినారు.

పదాభినయము, శుద్ధ సాత్వికరీతిని నాచే అభ్యసింపజేసినప్పుడు ఆమె మరొక్క విషయము నెరిగించినారు.

ఒకప్పుడు వేంకటగిరిమహారాజులు (బంగారేచ భూపాలురనుకుంటాను) అభినయ కేళికలో పోటీలు ఏర్పాటు చేసిరట. ఆ కాలంలో దేశంలో పేరుపొందిన నట్టువరాండ్రందరకూ ఆహ్వానములు పంపబడినవి. దక్షిణాది నుండి గూడా యెందరో నట్టువ

రాంధ్రకు వచ్చిరట-అందు చెంగల్పట్టు జిల్లాకు చెందిన చెయ్యూరు గ్రామనివాసి, చెయ్యూరు చెంగల్వరాయశాస్త్రి శిష్యురాలు శారద ముఖ్యురాలు.

అభినయానికిచ్చిన పదము—

"ఒక్కసారికే యిలాగైతే"—అనే క్షేత్రయ్య పదము, ప్రౌఢ నాయిక, అసంతృప్త.

పోటీలకు వచ్చినవారందరూ, కొందరు ఒక రోజూ, కొందరు రెండు రోజులూ ఈ విధంగా అభినయ కేళిక జేసి విరమించుకున్నారు. చెయ్యూరు శారద ఐదు రోజులు అభినయించి ఇక తనవల్లగాదని విరమించుకున్నారు. గురువుగారు ఏడు రోజులు ఏకధాటిగా అభినయించి సంస్థాన సన్మానమును పొందిరట-నేను అభినయ విద్య నేర్చినప్పుడు చిన్న వయస్సు-అభినయకళలో ఎక్కువగా ప్రవేశంగాని, అనుభవంగాని లేదు. అందువల్ల పల్లవి, అను పల్లవి మూడు చరణములు గల్గిన పదాన్ని వరుసగా ఏడు రోజులు దినానికి మూడు గంటలు చొప్పున యిరవై ఒక్కగంట అభినయించారంటే ఆశ్చర్యం కల్గింది. అదెలా సాధ్యమని అడిగినాను.

అభినయ కళావేత్త- కేవలము భరతశాస్త్రం, సంగీతము నభ్యసించుటతో సరిపోదు. అలంకారశాస్త్రము, రసశాస్త్రము, కళాశాస్త్రములను గూడా అభ్యసించి యుండాలి. ఇన్ని శాస్త్రములతో, కావ్యాలతో, ప్రబంధాలతో పరిచయముండినగాని సంపూర్ణ ప్రతిభను సాత్విక కళలో సంపాదించలేరు. ఆంగికానికి కొన్ని పరిధులుంటాయిగాని, సాత్వికాన్ని పూర్తిగా యెరిగినవారు అభినయకళ ఎప్పుడు ప్రదర్శించినా నిత్య నూతనంగా, సర్వాంగ సుందరంగా ప్రదర్శించే శక్తిని సంపాదించుకోగలరు. అభినయకళను తిలకించే రసిక హృదయులైన ప్రేక్షకులననుసరించే కళాకారుల హృదయ

వికాసం జెంది, భావ ప్రదర్శనలో విజృంభించేఅవకాశముంటుంది. అభినయించు కళాకారులకంటే ఉత్తమ స్థాయికి జెందిన పండితులు సభలో వున్నప్పుడే యిట్టిది సాధ్యపడుతుంది-అని ఆమె తెల్పినారు.

క్షేత్రయ్య పదములు-బూతుల బుంగలు, అసభ్యమైన రచనలు, అవినీతి ప్రబోధకములు, వీటిని ప్రభుత్వము నిషేధించాలని కొంత కాలము క్రిందట కొందరు పండితులు పత్రికల్లో విమర్శలు వ్రాశారు.

అసలు బూతు లేనిది లోకం లేదు, మనం లేము. మనం దేవుని నివాసంకొరకు కట్టిన ఆలయంయొక్క రూపమేమిటి? శివాలయంలో ఆరాధించే శివరూపం లింగం, పానవట్టము-ప్రకృతి, పురుషుల యొక్క సంయోగ చిహ్నముగాదా? మరి అది బూతుగా మనం తలంచుతున్నామా? ఆ భావం ఆలయానికి వెళ్లినప్పుడు మనకు కల్గుతుందా? అని మరికొందరు ప్రతి విమర్శలు వ్రాశారు.

క్షేత్రయ్య పదాలు కేవలం పండితులు, సాహితీవేత్తలు చదువుకోవడానికి వ్రాయబడిన రచనలుగావు. వివిధ శాస్త్రములను అధ్యయనంచేసి, సంగీతమును సాధనచేసి, పాడుతూ కళావేత్తలు అభినయించుటకొరకు రచన చేయబడినట్టివి. గనుక ఒక పదములోని సభ్యత, అసభ్యత గూర్చి, నీతి, అవినీతిని గూర్చి తెలిసికోవలెనన్న కేవలం ఆ పదమును చదివినంతలో లాభములేదు. లేక ఆ పదం, పాట విన్నంతలో ఉపయోగములేదు. మంచి వాచికము గల్గిన అభినయ కళావేత్త సాత్విక భావ ప్రకటన జేసినప్పుడు ఆయా పదములందలి నాయిక స్వరూపము మన కనులముందు రూపకల్పన జరుగుతుంది. గనుక ఈ పదముల సభ్యతను విమర్శించువారు కేవలము పండితులు, కవులు, సాహితీవేత్తలు మాత్రం అయినంతలో అర్హులు గారని నా అభిప్రాయం వారు స్వయంగా సంగీతం పాడగల్గి

వుండాలి, అభినయించ గల్గివుండాలి. అప్పుడుగాని ఆ పదముల యొక్క సంపూర్ణత తెలిసికోలేరు. పాడుతూ, సాహిత్య భావాన్ని పోషిస్తూ అభినయించిన ఆ పదమును కేవలము సాహిత్యంవలె చదివి నప్పుడు రూపము పూర్తిగా మారిపోవును. ప్రేక్షకుల దృష్టిలో బూతు ఎక్కడా కనిపించదు, కనిపించే అవకాశముండదు. బూతును గూర్చి ఆలోచించే సమయమే వుండదు. ఇదొక విచిత్రానుభూతి. ఇది అనుభవించినవారికే తెలుస్తుంది. బోధపడుతుంది. నేను సుమారు 300వరకూ పదములను అభ్యసించాను. పెద్ద పండిత సభల్లో అభిన యించాను. కాని నా కెప్పుడు ఆ అభినయంలో అసభ్యత కన్పించ లేదు.

ఈ సందర్భములో కొంతకాలం క్రిందట నేను ప్రత్యక్షంగా జూచిన ఒక అభినయ కేళిక గూర్చి యిచ్చట తెలియజేయుట సమంజ సముగా తలంచుచున్నాను.

అమలాపురం తాలూకా పేరూరు అగ్రహారం శివార్లలో విశ్వేశ్వర అగ్రహారం వుంది. అచ్చట విశ్వేశ్వరునికి కోవెల వుంది. ఆ స్వామికి కల్యాణమహోత్సవము ఐదు రోజులు జరుగును. ఈ ఐదు రోజులు అభినయ కేళిక, మేజువాణి జరుగును. ప్రతి రోజూ కొన్ని ప్రత్యేక పదములు, వర్ణములు అభినయించవలసి వుండును. ఆ పదములు, వర్ణములు, వాని అభినయ పద్ధతులు ఏ సంచారితో, ఏ ముద్రతో ప్రారంభించాలి, ఏ ముద్రతో ముగించవలయునో ఆ ఊరులోని ప్రతి ఒక్కరికీ తెలియును. అందువల్ల శాస్త్రీయంగా అభినయ కళ నేర్చినవారు, అంతేగాక శాస్త్రము, సంప్రదాయము రెండూ నెరిగిన కళావేత్తలు మాత్రము అచ్చటకు వెళ్లుదురు. అచ్చట జరిగే పండిత సభలో మేజువాణీలో మేళ నాయకురాలు మాత్రం గజ్జెకట్టి అభినయించును. మేళంలోని ఇతర నర్తకినులు

యితర సమయములందు ఆడుదురు. ప్రత్యేకంగా అభినయ కేళిక జేసే పదాల్లో ఆఖరి రోజున.

"సుదతి లందరుగూడి శోభనమని యంటే
అది యేమో అనుకొంటినే"—

యీ పదం అభినయించబడును—అని ఆ ఊరి ఒక మిత్రుడు చెప్పాడు.

అసలు పద సాహిత్యమే అసభ్యమంటే—అందులో ఈ 'శోభన' పదము, అభినయం నాకు మరీ ఆశ్చర్యము కలిగింది.

"అభినయ కేళిక జూచుటకు పండితులు, విద్వాంసులు, విద్యావేత్తలు" వత్తురా? అని అడిగాను.

"ఒక్క పండితులేమిటి? స్త్రీలు, పురుషులు అందరూ సమావేశమగుదు"రని అతడు తెల్పాడు.

"ఆ పదం మరీ శృంగార భరితంగాదా?" మీ యిండ్లలోని స్త్రీలు గూడా ఆ సభలకు యెలా వస్తారు?—అన్నాను. ఒక కళాకారుడు యిట్టి ప్రశ్న అడగడం అతనికి ఆశ్చర్యం కల్గింది.

"మా అమ్మగారు, అమ్మమ్మగారు, అక్కయ్యలు, చెల్లెండ్రు అందరూ మేజువాణి చూస్తారు. అంతేగాదు. ఆ పదం మా ఊరిలోని ప్రతి ఒక్కరికీ వచ్చును. అందువల్ల నట్టువరాలు ఏదైనా తప్పు హస్తము పట్టితే, వెంటనే ఆసించి, ఆ తప్పును తెలియజేసి, మరల అభినయం చేయిస్తారని తెల్పాడు.

"అది ఒక కళ-అందు బూతేముంది?

"మేమెప్పుడూ ఆ దృష్టిలో ఆలోచించలేదు. మనిషి యొక్క సంస్కారాన్ని బట్టి, ఆలోచనా దృక్పథాన్ననుసరించి వస్తువుల

యొక్క గుణదోషాలు నిరూపించబడుతాయి. సుమారు వంద సంవత్సరాలకుపైగా ఈ కేళికలు మా ఊరిలో జరుగుచున్నవి. శత సంవత్సరాల వృద్ధులు మా ఊరిలో వున్నారు. వారెవ్వరూ 'బూతు' అన్న భావం వెలిబుచ్చుట యింతవరకూ నేను వినలేదు. వారి వారి కుటుంబాలతో కలిసివచ్చి కేళికను జూస్తారు, ఆనందిస్తారు. మొదటి సారిగా అభినయ కళావేత్తలైన మీనుంచే ఈ సందేహం వింటున్నాను" అని మందలించాడు.

ఆ కేళిక చూడాలని నేను ఆ అగ్రహారం వెళ్లాను. ఐదవరోజు మేజువాణీలో ఒక ప్రసిద్ధ నాయకురాలు ఆ పదము నభినయించిరి. ఆ మేళములో ఏడుగురు స్త్రీలు వున్నారు, రెండు ఫిడేళ్లు, ఒక మృదంగం, శృతి. అందరూ కలిసి పదకొండు మంది. ఆ బృందం కళాకారులు స్త్రీలందరూ రంగు రంగుల బనారసు పువ్వుల చీరెలు కట్టారు. మేళము వూరేగింపు వెళ్లునప్పుడు తెల్లని వస్త్రాలు, మేజువాణీలో బనారసు రంగుల చీరెలు ధరించుట వారి ఆచారము. నాయకురాలు నడివయస్సు దాటిన యువతి. నున్నగా చెంపలపైకి దువ్వి ముడిగా వేసిన సిగచుట్టూ మల్లెపూదండలు, కండ్లకు కాటుక, పావలా కాసంత కుంకుమబొట్టు, మెడలో కట్లు కాసులదండ, చంద్రహారము, జిగినీ గొలుసు, చేతికి దండవంకీ, నడుముకు వడ్డాణము. ఆమెను చూస్తే వైదిక ముత్తైదువలా కన్పించింది. సభ సమావేశమవగానే గణపతి ప్రార్థన ముగించి, సభకు నమస్కరించి, గజ్జెలు ధరించి ఒక చిన్న ముక్తాయిని నృత్తమాడి.

"సుదతులందరుగూడి" పదము ఆలపించినది. ఒకటి, రెండు హస్తములు నిలబడి అభినయించి, అటుపై సభలో పద్మాసనము వేసికొని కూర్చుండి, అభినయం ప్రారంభించింది.

ఆమె నలాగే చూస్తూ కూర్చున్నాను. నడివయస్సు దాటిన 'లోల'-ఆ ప్రౌఢ, ముగ్ధ నాయికయైపోయినది. ఆమె ముఖములో

ఆ మార్పు గోచరమైనది-దీనినే శాస్త్రజ్ఞులు ముఖరాగ మందురు. ఆమె ఆ ముగ్ధ నాయిక భావాలను అభినయించుట ఆరంభించినది. ఆంగికము, ముద్రాభినయంతో ప్రారంభమైన ఆ కేళిక ఆంగికము ముగిసి సాత్వికము ప్రారంభమైనది. సభికులందరూ మంత్ర ముగ్ధులై రెప్ప నార్పక ఆ కేళికను తిలకించుచున్నారు. తన్మయులవు చున్నారు. నాకు అకస్మాత్తుగా ఆ మిత్రుని మాటలు జ్ఞాపకం వచ్చినవి. సభను కలియ జూచాను. శత సంవత్సరాల వృద్ధులున్నారు. నడి వయస్సులో వారున్నారు. యువకులున్నారు. పండు ముదుసలి ముత్తైదువలున్నారు. అప్పుడే కాపరానికి వచ్చిన జవ్వనులున్నారు. వారిలో యెట్టి వికృతపు చేష్టలుగాని నాకు గోచరించలేదు. అందరూ తన్మయులై ఆ రస లోకంలో విహరించుచున్నారు. రసానందములో నోలలాడుచున్నారు.

ఆ పదములోగాని, పాటలోగాని, అభినయంలోగాని బూతు యెచ్చటా కన్పించలేదు. అశ్లీలమనిపించలేదు. అదొక విచిత్రానుభూతి. మరువరాని మధుర సన్నివేశము. ఆ అభినయం ముగిసినా కొన్ని క్షణములవరకూ సభికులు నిశ్శబ్దంగా అలాగే శిలా ప్రతిమల్లాగా వుండిపోయారు.

మరి "బూతు" యెక్కడ వుంది.

మానవుని యొక్క ఆలోచన, హృదయ సంస్కారంలో దాగి వుందని-ఆనాడు తెలిసికొన్నాను.

*　　*　　*　　*　　*

II. బంగారు దుప్పటివాడట వాడేమేమో

ఔత్సుక్యం

పంతము లాడుకొన్నాడట!

శంక,　　　వితర్కం

అంగన లెందరనైన నలయక గూడునట

వితర్కం ఆవేగం

సంగీత లోలుడట-చాలా యీవిగాడట

హర్షం ఔత్సుక్యం, హర్షం

**సాత్వికము**

**ఆవేగము**

**ఇష్టంవల్ల పుట్టిన మనస్సునందలి తొందర రోమాంచము రతుల జూపవచ్చును.**

III. నన్నే లేమన్నాడట అంతలో నాడు—చిన్నెలు దెలిసినాడట

**లజ్జ ఔత్సుక్యం హర్షం**

మొన్న యిందు వచ్చెనట—మువ్వ గోపాలుడట

**విషాదం, శంక హర్షం, ధృతి, వితర్కం**

చిన్న వయస్సు వాడట-చెలియ! యందగాడట

**హర్షం ఔత్సుక్యం**

**సాత్వికము**

లజ్జ :—

| | |
|---|---|
| **తలవంచుకొనుట** | క్రింది చూపులు |
| పయ్యెద సర్దుకొనుట | ముఖము మళ్లించుకొనుట |
| గోళ్లు గిల్లుట | చూపునందు యెక్కువగా రెప్పపాట్లు |
| నేల గీరుట | చూపు మళ్లించుకొనుట. |

ముసి ముసి నవ్వులు

విషాదము .—

ముఖమందు దీనత్వము

చేతులు పిసుకుకొనుట

*     *     *     *     *

అభినయము ముగించునప్పుడు హర్షమును వెలిబుచ్చుటకు ధృతలయలో వీణ తహనము ననుసరించి నృత్తమాడి ముగించవలెను.

కుటిల కుంతలి :—

ఓ చెలియా, ఓ సఖియా

ఓ లలనా, ఓ మగువా - మొదలైన భావాలు వ్యక్తమగు హస్తములు పట్టిన పిదప-

నొక్కుల జుట్టు గలదానా
నల్లని కురులు గలదానా
పొడుగుపాటి శిరోజములు గలదానా
తుమ్మెద రెక్కలవంటి కేశరాసి గలదానా
ముఖ చంద్రుని నల్లని మేఘముల వలే
అలంకరించిన అలకలు గల నా ప్రియ చెలీ.
ఈ భావాలకు హస్తాలు పట్టవలెను.

ఆంగికము

ఎటువంటి వాడే, వాడూ !—

(1) చెక్కిలిని పతాకము జేర్చి.

(2) హృదయాని కెదురుగా రెండు చేతులందు అల పద్మ ములుపట్టి ప్రక్కలకు త్రిప్పుట.

(3) రెండవ దానియందువలె హస్తముల నుంచి, తల ప్రక్కల కాడించుట, వికాసవంతమైన చూపు.

(4) ఎడమ ప్రక్కగా నడుముపై రెండు చేతుల నుంచి- అర్ధ నిమీలిత నేత్రాలు. (ముఖము కొంచెంగా ప్రక్కకు త్రిప్ప వలెను)

(5) కుడిచేత శిఖరముపట్టి శిరము ముందుకు వెనుకకు లేక ప్రక్కలకు ఆడించుట.

శిరమున నెమలి పింఛము అలంకరించబడి వున్నదా.
విశాలమైన నుదురు గలవాడా
చెంపకు చేరడేసి కనులు గలవాడా
విశాలమైన వక్షము, యౌవనపు బింకము గలవాడా
ధిక్కరి తుండముల్ ధిక్కరించు బాహువుల్ గలవాడా
మెడలో వైజయంతిమాల యున్నదా
కాళ్ళకు బంగారు అందెలున్నవా
చేత మురళి యున్నదా
పెదవుల చిరునవ్వు లాస్య నర్తనమాడుచున్నదా
ప్రసన్న వదనం;
సొంపైన పలుకుగలవాడా
ఇంద్ర నీలపుడాలు నీసడింపగ జాలు దేహ కాంతి
గలవాడా

ఎటువంటి వాడే, ఎట్లున్నాడే—

ఓ మోహనాంగి, చిగురుబోణి, కంభుకంఠి, పద్మగంధి.

తెల్పవే—అనుభవము వ్యక్తమగునట్లు అభినయించుచూ; ఉత్సాహముతో అతడు ఆ వీధిని వస్తున్నాడేమోనని తొంగిజూచుచూ; మురళీరవము విన్నట్లు భ్రమించి నర్తనమాడుచూ; అది వట్టి భ్రమయని వెంటనే నిస్పృహజెంది, నిరాశతో నిట్టూర్చుచూ

విధిని దూషించుచూ

తన అలంకారములను తీసివేయుచున్నట్లు అభినయించుతూ అతడు ఆ వీధిని తప్పక వచ్చునని ధైర్యము జెందుచుండును. ఇట్టి మనోవికారములు ఈ నాయికలో కనబర్చవలెను.

సాత్వికాభినయము రెండు విధాలుగా దక్షిణాది భరతనాట్యమందు ప్రదర్శింపబడుచున్నది. నర్తకి సభలో నిలువబడి, స్థాయి భావ నిరూపణ జేసిన పిదప ఆయా నాయికలందలి సంచారులను ప్రదర్శించుట. ఇందు ప్రతి సంచారి ప్రారంభానికి, ముగింపునకు ఒక భంగిమ వుండును. వివిధ సంచారుల అభినయంలో ముద్రలు, మరియు శరీరము యొక్క లయ ప్రాధాన్య కదలికలుండును.

అటుగాక నర్తకి సభయందు కూర్చొని సాత్వికాభినయమును ప్రదర్శించుట-దీనినే శుద్ధ సాత్వికమందురు. ఇందు భంగిమలుండవు. ముఖ్యంగా ముఖ కవళికల ద్వారా వివిధ భావములు వ్యక్తము గావించబడును.

"ఎటువంటి వాడే వాడు" వంటి పదములు నిలువబడి కేళిక జేసినప్పుడు మాత్రం—ఆవేగం, ఔత్సుక్యం యిత్యాది సంచారులను నర్తనములో చూపించే అవకాశముండును. కూర్చొని అభినయించినప్పుడు ముఖ కవళికలు, కనులయందలి కాంతి, పెదవుల కదలిక, ముఖ కాంతి మార్పులు, చేతుల వ్రేళ్ళ కదలికలు, గగుర్పాటు యిత్యాదులవల్ల ఈ భావములు వ్యక్తము చేయబడును. ఇది చాలా క్లిష్టమైన కేళికా పద్ధతి. పూర్వం గూడా ఏ కొద్దిమంది కళావేత్తలో ఈ తీరు అభినయం చేయగల్గిన సమర్థత గల్గివుండిరి.

ఓ యమ్మా—

గడ్డము చూపుడు వ్రేలితో చుట్టి విస్మయముతో గూడిన చూపులు. మెల్లగా చేతులుతట్టుట.

వాడు—

పతాకమును ప్రక్కకు జూపుట

ఎన్నడూ-

పతాకము

ఈ వీధిని-

రెండు చేతులందు పతాకములు అరచేతులు పైకుండునట్లు పట్టి-ఒక ప్రక్కనుండి మరొక ప్రక్కకు తేవలెను.

రాడు—

చెక్కిలియందు చేయి-దీనత్వముతోగూడిన దృక్కులు.

కుటిల కుంతలి :—

చెలి హంసపక్ష ముందునుండి ప్రక్కకు తెచ్చి నిలుపవలెను. మువ్వగోపాలుడు-అభినయము ముందు పదాలలో వ్రాశాను.

పేరు—

మృగశీర్షము, హంసాస్యముగాని ముఖాని కెదురుగా పైనుండి క్రిందకు తెచ్చి నిల్పవలెను.

నల్లని మేనివాడట-

హంసాస్యముపట్టి, రెండు చేతుల పతాకములుపట్టి తలపై నుండి అవయవమునకు జూపవలెను.

నయము లెన్నో జేసునట-

ఎడమచేతి అర్ధ చంద్రయందు-కుడిచేతి అర్ధ చంద్ర అరచేతులు కలియునట్లు పట్టి-శిఖరముతో ముగించవలెను,

చల్లగా మాటాడునట-

రెండు చేతులు కలిపి మెల్లగా చప్పట్లు చరచి, తరవాత కటకా ముఖమును హృదయము వద్దనుండి పైకి తేవలెను.

సరసము-

పాశము పట్టిన

వాని సొమ్మట-

చిటిక వేయవలయును.

కల్ల గాదుట-

'నిజమట' అని చెప్పుటకు చేతిలో చెయ్యివేసి ప్రమాణము చేయునట్లు చూపవలెను.

కళలంట నేర్చునట-

ఇందు అంగ ప్రత్యంగ ఉపాంగములను ఒక్కటొక్కటే "మోహము" నాధారంగాగొని చలింపజేసి, శరీరమునంతయూ కంపింపజేసి, నేత్రములు మూతలు పడునట్లుజూపి, శరీరము వశము గానట్లభినయించి, స్వేదము, రోమాంచమునుగూడా జూపి, గాలి కల్లల్లాడు లేతీగెవలె కదలి, వ్రాలిపోతున్నట్లు అభినయించవలెను.

బంగారు—

కుడిచేత మృగశీర్ష హస్తము పట్టవలెను.

దుప్పటివాడట—

రెండు చేతులందు పతాకములుపట్టి, ఉత్తరీయము వేయునట్లు స్వస్తికా కారములో నుంచవలెను.

ఏమోమో?

అల పద్మము కుడిచేతపట్టి ప్రక్కలకు తల నాడించవలెను.

పంతము లాడుకొన్నాడట—

ఎడమచేత పతాకమందు, కుడిచేత శిఖరముంచవలెను. అటుపై ఎడమచేతిని నడుముపై నుంచి, కుడిచేత శిఖరము హృదయాని కెదురుగా నిలుపవలెను. గర్వముతోగూడిన చూపులు.

అంగన లెందరినైనా—

కుడి ప్రక్కకుగాని, ఎడమ ప్రక్కకుగాని రెండు చేతుల మృగశీర్షములుపట్టి నిలుపవలెను.

ఎడమచేత మృగశీర్షముపట్టి, ఎడమ ప్రక్కకు నిలుపవలెను.

అలయక—

చిటిక వేయుట

కూడునట-

రతికి సంబంధించిన హస్తములు పట్టవలెను.

(దీనిని గూర్చి 'శ్రీపతి సుతుబారికి' పదంలో వ్రాశాను)

సంగీత లోలుడట—

వీణ వాయించునట్లు మృగశీర్షములు పట్టవలెను.

వేణువు నూదునట్లు మృగశీర్షములు పట్టుట కృష్ణముద్ర.

చాలా—

మృగశీర్షము

యీావిగాడట—

రెండు చేతుల అలపద్మములు స్వస్తికంగా పట్టవలెను.

III. నన్నేలేమన్నాడట-

నన్ను—

అలపద్మము, వ్రేళ్లు కొనలు హృదయము తగులునట్లు పట్టవలెను; శిఖము బొటనవ్రేలు కొనను హృదయమునకు తగులునట్లు పట్టవలెను.

ఏ లేమన్నాడట-

కుడిచేత శిఖరము

నాదు చిన్నెలు దెలిసినాడ-

చెక్కిలి క్రింద చేయి నుంచవలెను.

మొన్న-

పతాకము వీపువైపు జూపుట;

పతాకము పట్టుట.

ఇందు-

పతాకము అధో ముఖముగా పట్టవలెను.

వచ్చెనట—

రెండు చేతులందు మృగశీర్షములుపట్టి, ముందు నుండి తన వైపుకు తేవలయును.

చిన్న వయసువాడట-

పతాకము

అందగాడట-

ముఖరము ముందు, అర్ధ చంద్ర వ్రేళ్ళను యెడముగానుంచి, కదలించుచు పట్టవలెను.

అవయవముల వర్ణనగూడా చెల్లును.

# 'భామారో యమూరికి-బయలుదేరెడువేళ'

నాయిక-స్వీయ, ప్రోషిత భర్తృక.

విప్రలంభ శృంగారము-కరుణరసము

**సంచారులు :-**

నిర్వేదము, దైన్యము, విషాదము, ముదము, గ్లాని, చింత, మోహము, స్మృతి, మతి, సుప్తి, ఆవేగము, ఔత్సుక్యం, జడత, అరతి, శంక, భయము, వితర్కము.

**దశావస్థలు**

(1) దృక్సంగము
(2) మనస్సంగము
(3) సంకల్పము
(4) జాగరము
(5) కృశత లేక కార్శ్యము
(6) అరుచి లేక అరతి
(7) లజ్జా త్యాగము
(8) ఉన్మాదము లేక ప్రలాపము
(9) మూర్ఛ లేక స్మారకము తప్పుట
(10) మరణము

దశావస్థలు ఈ నాయిక యందు అభినయించవలెను.

**ఆనంద భైరవి-త్రిపుట తాళము**

భామారో ! యమూరికి-బయలుదేరెడువేళ

| | | | |
|---|---|---|---|
| నిర్వేదం | దైన్యం | విషాదం | (దశావస్థలు) |
| 1 | 2 | 3 | |

**సాత్వికాభినయము**

(1) నిర్వేదము :-

బలము విడుచుట-శరీరము చిక్కుట

ముఖమందు, నేత్రములందు పేదరికము

కన్నులందశ్రువులు

నిట్టూర్పు

వెల వెల బోవుట

కనులు తుడుచుకొనుట

(2) దైన్యం :-

మనస్సునకుత్సాహం లేక యుండుట

స్తంభము

అంగములు వదులగుట

(3) విషాదము :-

చేతులు పిసుకుకొనుట

ప్రేమ మీర నా సామి—పిలిచి చెప్పిన మాట

| ముదము | గ్లాని |
|---|---|
| (1) | (2) |

(1) ముదము :-

ముఖము, నేత్రములందు వికాసము

(2) గ్లాని :—

మెల్లన పనులు

ఉత్సాహలేమి

వెల వెల బోవుట

ఏమని తెలుపుదు నేలాగు తాళుదు—ఏమిచేతు నే చెలియా!

| | | | |
|---|---|---|---|
| **చింత** | **స్మృతి** | **మోహము** | **విషాదము** |
| **1** | **2** | **3** | **4** |

(1) చింత :—

నిట్టూర్పు

(2) స్మృతి :—

కనుబొమల నెగురవేయుట
శిరస్సును ఆడించుట
బొమముడి

(4) విషాదము :—

ముఖమందు విచారము
చేతులు పిసుకుకొనుట
ఉత్సాహలేమి
తలయెత్తి చూడకుండుట
దైవమందు మనస్సు నిల్పియుండుట
(పైకి జూచుట)
శూన్య దృక్కులు

**ఆంగికము**

భామారో :—

(1) రెండు చేతులందు మృగశీర్షములుపట్టి కుడి ప్రక్కకు గాని, ఎడమ ప్రక్కకుగాని తెచ్చి నిల్పుట.

(2) ఎడమచేత శిఖరము, కుడిచేత అలపద్మం పట్టి దృష్టి శిఖరముపైనుంచుట (విషాద దృక్కులు)

ఊరికి-

ఎడమచేత హృదయాని కెదురుగా అలపద్మం, కుడిచేత సూచి పట్టి తలపైకి పోనిచ్చి, చక్రాకారంగా త్రిప్పవలెను.

బయలుదేరె-

రెండు మృగశీర్షములుపట్టి హృదయానికి ఎదురుగా ఒకదాని తరువాత ఒకటి ముందుకు నడుపవలెను. దీనికి ముందుకు అడుగులు వేయాలి.

వేళ-

కుడిచేత పతాకము

ప్రేమమీర-

రెండు అలపద్మములు స్వస్తికంగా పట్టవలెను.

నా సామి-

మాంగళ్యము కనులకద్దుకొనుట లేక నమస్కారము లేక ఎడమచేత శిఖరం, కుడిచేత మృగశీర్షం పట్టవలెను.

పిలిచి-

మృగశీర్ష ముందునుండి హృదయంవద్దకు లాగి

చెప్పిన మాట-

ముకుళ హస్తము హృదయంవద్ద నుండి ముఖంవద్దకు తెచ్చి-మృగశీర్షం పైనుండి క్రిందికి ముఖాని కెదురుగా తేవలెను.

(విషాద దృక్కులు)

ఏమని-

నొసటి యొద్దనుండి ముందుకు ముకుళ హస్తాన్ని వికసింప జేస్తూ తేవాలి.

తెలుపుదు-

హంసాస్యము

ఏలాగు తాళుదు-

ఎడమచేతి పతాకమందు కుడిచేత పట్టిన పతాకము అరచేతులు తగులునట్లుంచి-చేతులు పిసుకుకొనునట్లు చూపవలెను.

ఏమిచేతునే చెలియా?

చెక్కిలి క్రింద ఎడమచేతపట్టిన పతాకముంచి దీన దృకు్కలు.

*  *  *  *  *

I అన్నమిందక-అతివేత నొందకు

మతి

**సాత్వికము-మతి :-**

బోధన చేయునట్లు కనబడుట

సంతోషము కనబర్చుట

సంశయ నివారణమైనట్లు కనబడుట

కనుబొమల నాడించుట

యుక్తమగు పనులు చేయుట

| కన్నీరు | నింపకు - | కలువరింపకుమనీ |
|---|---|---|
| దైన్యము | చింత | సుప్తి |
| 1 | 2 | 8 |

సాత్వికము :—

(1) దైన్యము :—

అశ్రుపూరిత నేత్రాలు

(3) సుప్తి :—

కనులు మూసుకొనుట-

| | |
|---|---|
| జాలి మాపులు | వెంటనే గవాలున తెరచుట. |
| శరీరము కుంచుకొనుట | ఇంద్రియములందు నిశ్చల |
| మనస్సు వ్యాకులత | త్వము, చలనము |
| అంగములు శిథిలములగుట | ఉచ్ఛ్వాస నిశ్వాసములు |
| | కనబర్చుట |

ఎన్నెన్నో విధముల -హితవులు తెలుపుచు

స్మృతి చింత

కన్నీరు నించుచు - కాంతుడు చెప్పినమాట

విషాదము నిర్వేదము స్మృతి

**ఆంగికము-**

అన్నమిందక-

ముకుళ హస్తం నోటివద్దకు తేవలెను.

అతివెత నొందకు-

సర్ప శీర్షముతో తల దువ్వినట్లు

కన్నీరు నింపకు—

హంసపక్షములోని చిటికెనవ్రేలుతో నేత్రాలు జూపి, మృగ శీర్షంతో ముగించాలి.

కలువరింపకుమని—

చెక్కిలి క్రింద చేయి నుంచి నిద్ర నభినయించి, దిగ్గున కనులు విప్పి-కుడిచేత హంసాస్యం లేక అలపద్మం పట్టవలెను.

ఇంతవరకు 'పురుష వచనం' గనుక అభినయంలో ఆ భేదం కనబడాలి.

ఎన్నెన్నో విధముల-

రెండు చేతులందు హంసాస్యములు హృదయాని కెదురుగా పట్టి, ఇరుప్రక్కలకు అర్ధచంద్రాకారంగా కొనిపోవలెను. లేక ముకుళంతో మొదలుపెట్టి, ప్రేళ్ళను వికసింపజేయవలెను.

హితవులు తెలుపుచు-

పతాకము పట్టిన చాలును.

కన్నీరు నించుచు-

హంస పక్షములతో నేత్రముల జూపి

కాంతుడు-

పురుష హస్తము

చెప్పిన మాట-ముందువలె.

*   *   *   *   *

III. నిడివి కన్నులనీరు - నించుచు దలయూచి

ఖేదము   నిర్వేదము

తడలేక వేగమే - తానే వచ్చెదనని

ఆవేగము   ఔత్సుక్యము

సాత్వికము-

ఆవేగము :-

కష్టమువలన పుట్టిన మనస్సునందలి తొందర.

మనస్సు తడబాటు

ఉత్సాహము

ఔత్సుక్యము :-

తొందరపాటు

నిశ్వాస
ఏమీ తోచకుండుట

అడుగడుగునకు సు - రసురని మదిలోన

దైన్యము గ్లాని

నిశ్వాసలు

జడత

అరతి

**సాత్వికము-**

**జడత-**

రెప్పపాటు లేక యుండుట

ఇష్టముగాని, అయిష్టముగాని జూచుటవల్ల శరీరము మరచుట. జాగు, మాంద్యము, మెల్లన పనులు.

అరతి—

ఆలస్యము

గ్లాని-

ఆయాసముచే హడలుతూ వుండుట

ఉత్సాహలేమి.

కడు మోహమున ప్రాణే — శుడు బలికిన మాట

మోహము స్మృతి దైన్యం

**సాత్వికము-**

**మోహము-**

కనులు మూసుకొని శరీరము కంపించుట

మై మరపు

ఆంగికము-

నిడివి కన్నులనీరు-

హంసపక్ష కన్నుల కెదురుగా చూపి దింపవలెను.

తలయూచి-

ఎడమచేతిని జారవిడిచి కుడిచేత కపిత్థమును గడ్డమునకు దిగువగా కొంత ఎడముగానుంచి ప్రక్కలకుగాని, ముందు వెనుకలకుగాని తలను మెల్లగా ఆడించవలెను.

తడ లేక వేగమే-

చిటికవేసి పతాకము పట్టవలెను.

వచ్చెదనని-

'బయలుదేరె' అన్నప్పుడు పట్టినట్లేగాని, హస్తాలను మన వైపుకు చేర్చుకునేది.

అడుగడుగునకు—

'బయలుదేరె' నందువలె.

ఉసురసురని—

'పలాగు తాళుదు' నందువలె—హస్తములుపట్టి ఉచ్ఛ్వాస నిశ్వాసలు.

మదిలోన—

హృదయాని కెదురుగా ముకుళ హస్తాన్ని నిశ్చల దృక్కులతో వికసింపజేసి, నేత్రములు మూయవలెను.

కడు మోహమున—

మృగశీర్షము పైనుండి క్రిందికిలాగి, అలపద్మముల స్వస్తికముగా పట్టవలెను.

ప్రాణేశుడు - పలికిన మాట (ముందటివలె)

IIIఏ నోము నోచితినో - యెంతని వేడితినో

విషాదము దైన్యము

తానేమి వ్రాసేనో - తలమీద విధియన

శంక, భయము నిర్వేదము

చాయగా దైన్యంతో కూడిన

వితర్కం

సాత్వికం-శంక :-

గద్గదిక

దిక్కుల జూచుట

వెల వెల బోవుట

వితర్కం-

కనుబోమల నెత్తుట

తల ముందుకు ఆడించుట

ఆలోచిస్తూ వున్నట్టు కనబర్చుట

పూనిక తోడ మా మువ్వ గోపాలుడు

మతి మోహము

మతి-

సంశయ నివారణ

కనుబొమ్మల నాడించుట

సూన శరుని కేళి - సుఖియింతుమను మాట

ఔత్సుక్యము

రతి విశేషములు

మోహము

**ఆంగికము**

ఏ నోము నోచితినో-

పూజా విధానము నభినయించవలెను.

ఎంతని వేడితినో-

ముకులములనుపట్టి కుడి ప్రక్కకుగాని, ఎడమ ప్రక్కకుగాని చేతులను పొడిగించి వికసింపజేయవలెను.

తానేమి వ్రాసేనో-తలమీద విధియన-

బ్రహ్మ హస్తముపట్టి-ఎడమచేత పతాకమందు, కుడిచేత హంసాస్యంతో లిఖించునట్లు చూపి, నొసటివద్ద నుండి క్రిందికి ముకుళ హస్తము తెస్తూ వికసింపజేయవలెను.

పూనిక తోడ-

కుడిచేత శిఖరము హృదయానికెదురుగా పట్టవలెను.

మా-

అలపద్మము ముందునుండి హృదయమువద్దకు తేవలెను.

మువ్వ గోపాలుడు-

ఎడమచేత అలపద్మం హృదయాని కెదురుగాపట్టి, కుడిచేత పట్టిన సూచీ తలపై త్రిప్పి; వేణుధారణ హస్తము పట్టవలెను.

సూనశరుని కేళి-

రతి విశేషాలు

సుఖియింతము - పతాకము

# ఇందెందు వచ్చితివిరా?

సురట రాగము - త్రిపుట తాళము

... ... ... ... ... ... ...

నాయిక—సామాన్య, ప్రౌఢధీర, ఖండిత.

నాయకుడు—దృష్టుడు, అద్భుత రసము.

సంచారులు—రోషము, అసూయ, గర్వము, వితర్కము, మదము, శంక, అమర్షము, ముదము, చపలత, దైన్యము, ఉగ్రత, మోహం.

ప॥ ఇందెందు వచ్చితివిరా! అలదాని యిల్లు

రోషం అసూయ అసూయ

గర్వం వితర్కం, ముదము

ఈ వీధిగాదు పోపోరా॥

అమర్షం ఉగ్రత

రోషము, గర్వము మొ॥ అభినయించు విధము :—

తల పంకించుట, ఆలోచించుట

ఉత్సాహాముతో తర్జనభర్జన చేయుట

నిందించుట, అహంభావముతో అడుగుట

ప్రశ్నించుట, ముఖము త్రిప్పుకొనుట
ఒడలు విరుచుకొనుట, అవమానకరముగా ప్రశ్నించుట
ఇందెందు వచ్చితివిరా?
ఎందుకు వచ్చితివి—తర్కించుట
రాకూడదే—
ఇచ్చోటకు రాగూడదు
పొరపాటున వచ్చితివేమో?
అలదాని యిల్లు యిదే అని వచ్చితివేమో?

నిర్లక్ష్యముగా ప్రశ్న, ఇన్నాళ్ళూ లేని మమకారము, ప్రేమ, అనురాగము ఈ రోజున కలిగె వచ్చావా?

ఏమి మునిగినదని వచ్చావు?
నిన్నెవ్వరు రమ్మనిరీ?

నేనేమైన రాయబారమంపితినా, సఖులు వచ్చి బ్రతిమాలిరా? లేదే-మరెందుకు వచ్చితివీ, పొరపాటు, పొరపాటు.

ముఖము ప్రక్కకు త్రిప్పుకొనుట
కనుబొమలు యెగరవేయుట
మూతి త్రిప్పుట
బొమముడి-నొసలు చిట్లించుట
చేతులను త్రిప్పుతూ మాట్లాడుట
"ముదము"లో—
ముఖము, నేత్రము వికాసము
ముఖము రంగు మారుట
ప్రియపు మాటలు-ఇచ్చట ఎత్తి పొడుపు, దెప్పుట.

పులకలు—ఇచ్చట ఈ సాత్వికము ద్వంద్వభావము ప్రదర్శించుటకు ఉపయోగించవలెను.

మనస్సున అతడు వచ్చెననే ఆనందముకల్గి పులకలు పుట్టును. కాని పైకి అతనిని ఎగతాళి చేస్తూ-

ఇదుగో చూడూ నీవు వచ్చావని నా శరీరం పులకరించింది- అని హాస్యంచేస్తూ, మూతి త్రిప్పుతూ అభినయించబడును.

అతడు వచ్చెనని మనస్సున ఆనందము, కాని దానిని మరుగు పరచి, విరక్తిభావము వెలిబుచ్చుట.

కంఠ స్వరములో మార్పు-ఎగతాళిభావము.

నీవు వచ్చినందువల్ల నా శరీరముప్పొంగిపోయింది

చూచావా? స్వామీ—దెప్పిపొడుపు

చేతులు తట్టుతూ-వచ్చారా ప్రభువులు, దయచేయండి, దయచేయండి.

ఎక్కడికి?-

స్వామీ

"అలదాని యిల్లు ఈ వీధిగాదు"-గనుక దాని వీధికి వెళ్ళండి—అదిగో ఆ నంది అది వుండే గుడిసె, ఆ యిరుకు గొందు, అబ్బబ్బా ఆ మురికి గొంది. అదే—ఆ గుడిసే దాని నివాస గృహం. మీరు వెళ్ళవలసిన అంతఃపురము, విలాసమందిరము, అక్కడకు వెళ్ళండి.

దయచేయండి-ఇలా మా యింటిలోనికి వేంచేస్తున్నారేమి ఖర్మ-వెళ్ళండి, త్వరగా వెళ్ళండి, అది మీకొరకు వేచివుంటుంది. వెళ్ళండి-వెళ్ళరా-కండ్లెర్రజేసి-చేయి పుచ్చుకొని గుమ్మమువరకు సాగనంపనా, అతని చేయిని పుచ్చుకొని గుమ్మమువరకు సాగనంపి-నొసటపట్టిన చెమట బిందువులను తుడుచుకొని

అటుపై —

నిజముగా వాడు అలిగి రాడేమో!—శంక.

ఆ—రాక యెక్కడికిపోవును—ధీమా

అతని ప్రవర్తనకు యీ మాత్రము దండన అవసరం—అని మనస్సున తృప్తిచెందుట.

**అలదాని యిల్లు-**
ఆ మాయలమారి
ఆ మర్లు మందుపెట్టే కులుకులాడి, వగలాడి
ఆ అందగత్తె (ఎగతాళి భావము)
ఆ విజ్ఞానవేత్త
ఇల్లు—
దాని **మహల్**
దాని అంతఃపురము

జాగ్రత్త! గుమ్మము తలకు తగులుతుందిసుమా, కాస్త ఒంగి లోపలికి వెళ్ళు

దాని పూరిల్లు
ఈ వీధిగాదు (అమర్షము)—
**స్వామీ ఈ వీధిగాదు-ప్రభూ ఈ వీధిగాదు**
**అయ్యో ఈ వీధిని లేదే**
**అదుగో-అదుగో ఆ వీధికే వెళ్ళండి**

* * *

అ॥ మందిర గిరిధరుడైన! మా మువ్వగోపాల

**ముదము** దైన్యం

కుందరవనమది కోరి యిందు వచ్చితివా!

**అసూయ** ముదము, శంక, వితర్కం

పల్లవి అభినయమందు అంతటి కర్కశత్వము వహించిన ఖండిత "మందరగిరిధరుడైన"—

అనినంతనే-అదంతయూ సూర్యోదయానికి మంచువలే, నిప్పు సెగలకు వెన్నవలే కరిగిపోయీ,

ఆ గోపాలుని నామోచ్చారణ చేసినప్పుడు
కంఠములో మాధుర్యము
గాత్రములో తన్మయత్వము కల్గును.
అదియే 'ముద'మనే సంచారిలో ప్రదర్శితమగును.
అది ప్రదర్శించు విధము
ప్రియుడు వచ్చెనని ఆత్మకు ఆనందము.
ముఖమున, నేత్రములందు వికాసము.

ప్రియముగా మాట్లాడుట-(ఇయ్యది పదము పాడునప్పుడు గాత్రములో ప్రదర్శించబడును)

శరీరము పులకరించుట;
కన్నులందు ఆనంద బాష్పములు
శరీరముపొంగుట
చెమర్చుట-
ఈ భావప్రకటన చేయవలెను.
అంతట—'మువ్వగోపాల' నామోచ్ఛరణతో
ఆమెలోని గర్వము పూర్తిగా హరించుకుపోయి
'దైన్యముతో'-వేడుకొనుట, నమస్కరించుట
మొదలైన భావముల ప్రకటించును.

చ॥ హెచ్చైన వెన్నెలలో! ఇల్లు తెలియక నీవు
ముదము ముదము రోషము

మెచ్చుకంటినిగూడి! మైమరచినావో
అసూయ శంక, వితర్కం, ఉన్మాదం

మచ్చికతో దాని! మనసు చల్లగజేసి
హర్షం ముదము రోషము
గ్రుచ్చి కౌగలించిన! కోమలినేగాను॥ ఇందెందు॥
అసూయ, మోహం రోషం, ఉగ్రత
హెచ్చైన వెన్నెలలో

వెన్నెలకు చిత్రాభినయము ప్రదర్శించవలెను.
చిత్రాభినయము ఆంగికానికి సంబంధించినది

వెన్నెల వెలుగు-ఆకసము నక్షత్రములతో ప్రకాశించుతీరు-చల్లని చంద్రకిరణములు-పుష్పలతలు వికసించుట పిల్లవాయువుల తాకిడికి-మలయపవనుడు ఆ పుష్ప సౌరభాన్ని లోకంలో విరజిమ్మట-వెన్నెలలో విరహిణులు, వారు వియోగమున పరితపించు విధము-జ్యోత్స్నలు అలంకరించుకొని అభిసారికలై తమ ప్రియుని చేర బోవుట-ఇవన్నియూ ఇందు ప్రదర్శింతురు. ఈ భావములనే కూర్చొని అభినయించినప్పుడు కేవలము హస్తములు ముఖ భావ ప్రదర్శన వుండును. నిలబడి ప్రదర్శించినప్పుడు జ్యోత్స్న అభిసారిక యిత్యాదుల గమనము ప్రదర్శించవలసినప్పుడు లయ విన్యాసముతో ఆయా నాయికలకు సరిపోవు అడుగులు, భంగిమలు కూడా ప్రదర్శించుట గలదు.

ఇల్లు తెలియక—

ఇండ్లను వెదుకుట-ఇంటిని గుర్తించలేక అటునిటు జూచుట; వేరొక యిల్లు ఆ యిల్లు అనుకొని తలుపు తట్టుట; తలుపు తీసిన ఆ జవ్వని తన ప్రియురాలుగాదని నిరాశ జెందుట-వెదికి వేసారుట-విధిలేక ఆమె యిల్లు ప్రవేశించుట, పొరపాటున ఆ యింటిలోనికి వచ్చుట, ఆమె యిల్లని యెరుంగక ఆ యింట ప్రవేశించుట-

ఆ మాయలమారి యిల్లని భ్రమించి ఈ ఖండిత యింటిలోనికి వచ్చుట.

ఈ భావములన్నీ ప్రదర్శించుతూ—
'రోషము'తో ముగించవలెను.

దండించుట, తర్కించుట, కించపరుచుట, హేళన చేయుట, నిర్లక్ష్యము చేయుట మొదలగు భావములు పట్టవలయును.

మచ్చకంటినిగూడి—ఆ మీన నేత్రిని-కన్నుల ఆకారము మీన నేత్రిని-చేప పొలుసులోవలే మెఱుపు కాంతిని గల్గిన నేత్రాలు ఇది ఎగతాళి భావము ఇచ్చుట అవయవ దూషణ జేయును.

అసూయ, ఈర్ష్యను ప్రదర్శించు క్రమము
ఇతరులకు గల్గిన మేలును జూచి ఓర్వలేకుండుట
ముఖము త్రిప్పుకొనుట
మూతి త్రిప్పుట
మెటికలు విరుచుట
మొదలగునవి ప్రదర్శించవలెను.

మైమరచినావో
నిన్ను నీవు మరిచితివేమో?
అలదానిని గూడి ఆ ఆనందంలో, ఆ మైకములో
ఆ తన్మయత్వములో నీ మనస్సుపై స్వాధీనము
తప్పితివేమో?
శంక ప్రదర్శించుతీరు—
వర్ణము మారుట—ముఖరాగము

సందేహపడుట

ఆశ్చర్యపోవుట, వెల వెలపోవుట

వితర్కములో—ప్రశ్నించుట, తర్కించుట, కనుబొమలు యెత్తుట, తల ముందుకు ఆడించుట, ఆలోచించునట్లు కనబర్చుట.

శంక, వితర్కం, ఉన్మాద సంచారిలో పరాకాష్ట నొందుటలో ఈ భావప్రకటన ముగియును.

సంబంధములేని లేక కారణములేని నవ్వు

వల వల ఏడ్చుట—

నిలకడలేని నడచుట

చేతనా చేతనములైన వస్తువులనూ, పక్ష్యాదులను సంబోధించుచు తన నాయకునితో మాట్లాడుట.

తన పెంపుడు చిలుకను ప్రశ్నించుట. దానికి తన గోడును విన్న వించుకొనుట.

* * * * *

మచ్చికతో దాని-

హర్షము ప్రదర్శించుతీరు

ప్రేమతో దానిని, అనురాగముతో దానిని,

వలపుతో దానిని, ఇష్టముతో దానిని

ముఖము నేత్రములందు వికాసము

శరీరము పొంగుట-గగుర్పాటు-చేతులు తట్టుట.

ఈ భావములన్ని ఈర్ష్య ప్రాధాన్యంగా ప్రదర్శించవలెను.

* * * * *

మనసు చల్లగ జేసి-

ముదము ప్రదర్శించుతీరు—

దాని మనస్సులోని కోర్కె లీడేర్చి-

దాని మనస్సు తృప్తిపరిచి-

విరహతాపము చల్లార్చి—

ఈ భావములు "రోషము" ఆధారంతో ప్రదర్శించవలెను.
గ్రుచ్చి కౌగలించిన-
ఆలింగనములు, చుంబనాది

శృంగార చేష్టలు (వివరములు ప్రారంభములో యిచ్చినాను)
వీటి సౌఖ్యం ఆ వగలాడికి అతనివల్ల లభించినవని
ఓర్వలేని తనము.

ఆ శృంగార చేష్టలను తలంచుకొనినప్పుడు తనలో కలిగే
మనోవికారము.
అది ప్రదర్శించుతీరు-
మూర్ఛ చెందుట
దుఃఖము, మూర్ఛ-గుడ్లు తేలవేయుట
నిలువలేక వ్రాలిపోవుట

కండ్లు మూసుకొని శరీరము స్వాధీనం తప్పినట్లు నటించుట.
శూన్యదృక్కులు-భూమిపై వ్రాలుట
ఇవన్నీ ఈ నాయిక నటించిన శోభించును

ఈమెకు చెల్లును.
**కోమలి నేగాను-**

ఆ స్త్రీ నేను—ఆ వగలాడి నేగాను

ఆ లలితాంగి నే గాను
ఆ పువ్వుబోడి నే గాను
ఆ చందనగంధి నే గాను
ఆ కంబుకుంఠి నే గాను
'ఆ మత్స్యగంధి'ని నేనసలేగాను
కాను-ముమ్మాటికి-ఒట్టుపెట్టి,
దైవముపై ప్రమాణముజేసి చెప్పెదను.

ఈ భావములన్నీ వెటకారముతో గూడినవి.
ఈ గుణములన్నీ దానిలో లేవని తెల్పుట.

నడిరేయి ఝామువేళ నాతి నీవును గూడి
**రోషము** అసూయ **అమర్షం**

నడుచుకొన్న చిన్నెలు మానాతి దెలిపెనులేరా
**రతి విశేషములు** రోషము **అమర్షం**

వడివడి వీధిలో వద్దకి వచ్చి రవిక
**అమర్షం** రోషం అమర్షం

ముడి విప్పి వచ్చిన మచ్చువు నీవేకావా ॥ఇందెందు॥
**అసూయ** రోషం-ఉగ్రత-శంక-వితర్కం

**మదము-**
**నడిరేయి-**

చిత్రాభినయము-(రాత్రిని తెలుపుటకు)
నడిరేయిని దెల్పుటకు సుషుప్తావస్థను అభినయించవలెను.

నిద్రమత్తు, మగత, శరీరము తూగాడుట, కనులు మూతలు పడుట, యెర్రబడుట, శరీరము బరువు, అలసట, ఆవలింతలు.

ఈ భావములను 'రోషము'తో జేర్చి అభినయించవలెను.
నడుచుకొన్న చిన్నెలు-

దంతక్షతములు, నఖక్షతములు, ఆలింగనచుంబనాదులు, బంధనాది విశేషములు-వీటిని కళాశాస్త్ర ప్రమాణముగా అభినయించ

వలెను. నాయిక సామాన్య గనుక స్వేచ్ఛగా కొన్ని విన్యాసములు ప్రదర్శించవచ్చును. హస్తాభినయము.

మానాతి-మా సఖి, మా చెలియ

వడివడివీధిలో-ఆవేగము-ఈ భావమును ముఖ్యముగా నర్తకి సభలో నిలబడి అభినయించునప్పుడు పాద విన్యాసములతో ప్రదర్శించుటకు, లయ ప్రాధాన్యంగా కొన్ని అడుగులు వేయుచూ-ఆడుటవల్ల ప్రకటితమవును.

వద్దకి వచ్చి రవిక ముడివిప్పి వచ్చిన } ఇచ్చట ద్వంద్వాభినయ ప్రదర్శిత మగును.

నాయకుని రాక, ఆగమనములోని ఆవేగము.

నాయిక అతని రాకని చూచి పొందే అనుభూతులు.

అతడు దూరముగానున్నప్పుడు ఆమెకు కలిగే శంక, అటుపై అతడేననే నిర్ధారణ, అతడు వచ్చెనని ఆనందము, ఆ ఆనందంలో కలిగే సాత్వికమైన మార్పులు, అటుపై ఆంగికమైన మార్పులు, నాయకుడు ఆమెను చేరినప్పటి మనస్థితి.

"రవికె ముడి విప్పుటకు"-అతని ప్రయత్నము, ఆమె సిగ్గు, తడబడుట, మనసులో ఆనందము.

నడివీధిగాన యెవరైన చూచెదరేమో అని జంకు, అతని వారించుట, సిగ్గుపడుట, అతని చేతివ్రేళ్ళు తన శరీరానికి తగిలినంతయే ఆ స్పర్శవల్ల నాయిక పొందే ఆనందస్థితి, శరీరము పులకరించుట, చెమర్చుట, వణుకు, నేత్రములు చెమర్చుట, రెప్పలు బరువెక్కుట, మూతపడుట, మొదలైన భావములన్ని.

రోషం:—అసూయ, మదము-ఈ మూడింటి ఆధారముతో ప్రకటించవలెను.

అసూయ, అసహ్యత, నిందాభావము, దూషణ, ముఖం తిప్పుకొనుట, మొటికలు విరుచుట, శరీరాన్ని వికృతంచేసి వెకిలి భావము ప్రకటించుటతోను, ముఖము, కండ్లు యెఱ్ఱబడుట

క్రోధముచే శరీరము వణకుట, కంపించుట.

చేతుల నాడించుట, గతిభంగము

పెద్దగా నవ్వుట, వంకర నడకలు (గతి భేదము)

వయ్యారపు నడకలు (ఎగతాళి భావము)

మొదలైన భావములచేత మదమును ప్రకటించవలెను.

ముచ్చవు నీవేకావా?-

నీవు కదూ? కాదంటావా? ఏమి? చెప్పవేమి? మాట్లాడవేమి? నా దగ్గర దాపరికమెందుకు? అంత భయపడేవానివి, సిగ్గుపడేవానివి, అభిమానపడేవానివి మరి దానినెందుకు చేరబోయినావూ?

నాకు తెలియదనుకున్నావా?

అవును తెలిసి నిన్నేమి చేయగలనులే?

నే నెవతెను?

మరెందులకు నా యింటికి వచ్చితివి?

నా అంతటి అమాయకురాలు ఈ లోకంలో వుందా?

నా అంతటి తెలివిలేనిది ఈ ప్రపంచంలో వుందా?

అని చింతించుట, కన్నీరించుట, వెక్కి వెక్కి ఏడ్చుచున్నట్లు అభినయించుట-పట్టవలెను.

(3) మదన లాహిరి మించి మదవతివలె వచ్చి

గర్వం అసూయ

వదలకున్న విదేల వద్దు పోపోరా

శంక, వితర్కం, ఉగ్రత, రోషం

మదన కేళినిగూడి మనసు మెప్పించినది

చపలత మోహం

యువిదలందరు జూచే—రుదయ మాయెనులేరా॥

॥ఇందెందు॥

రోషం అసూయ అమర్షం అసూయ

అహంభావము-గర్వము

తన అవయవములను జూచుకొనుట.

శరీరము విరుచుకొనుట.

తన చక్కదనము తెలియజేయునట్లు ప్రవర్తించుట.

వయ్యారపు నడకలు, అవయవముల కదలికలు.

నేత్రముల చలనము, పెదవుల కదలిక

సొగసైన నవ్వు—యవ్వనపు పొంగు

శరీరములోని అవయవశోభ ప్రదర్శింపబడురీతిని

శరీరమును భంగిమలందుంచుట.

తాను విద్యావతినని తెల్పుటకు పాండితీ ప్రదర్శనము

సంగీతమునందు, వీణా వాదనమునందు, కవితనల్లుటయందు, అలంకరణయందు సమర్థురాలనని ప్రదర్శించుకొనుట.

ఇన్ని విధాల తన ఔన్నత్యము ప్రదర్శించుతూ

హుందాగా అతన్ని అనుగ్రహించినట్లు వ్యక్తము చేయుట

గర్వమందు ప్రదర్శితమగును.

ఇవన్నీ తనకున్నవి.

దానికే మున్నవి?

గుణమందా? విద్యయందా?

సౌందర్యమందా, యౌవనమందా?

అంతటి తక్కువదానిని అతడు కోరి కలిసివచ్చిననూ తాను దయదలిచి, జాలిపడి, సంస్కారవతిగాన అతని అనుగ్రహించి తన యింటిలోనికి రానిచ్చినట్లు భావము ప్రకటించుట.

వదలకున్నవిదేల వద్దు పోపోరా

యిందు శంక, వితర్కం, ఉగ్రత మొదలైన సంచారులు అభినయించవలెను.

అదెట్లనగా—

నిజముగా ఉగ్రత, రోషంగాక మనస్సులో కోపము చల్లారిననూ, పైకి బెట్టుసరిపోని విధముగా— ఉగ్రత, రోషం - నటించును- ఇచ్చట అతడు నిజముగా పోవాలనే భావం నాయిక మనస్సునందు లేదు. గాని ఆ మాత్రం దండించనిచో లాభంలేదని-పై పై మాట

లతో; చేతలతో బెదిరించును. అతడు విసిగిపోవునేమో అని శంకచేత, మధ్య మధ్య జాగ్రత్తపడును.

ఆఖరికి అతని రతికేళిని గూడును.

అందువల్ల పైభావములను—చపలత్వముతోగూడిన భావప్రకటనతో నిండియుండిన శోభించును.

మదనకేళినిగూడి, మనస్సు మెప్పించినది

యువిదలందరు జూచే—రుదయమాయెనులేరా?

తొలికోడి కూసినది, తెల్లవారినది, ఆలయంలో మేల్కొలుపు వినిపిస్తున్నది.

యువతులందరూ నిదుర లేతురు

అందువల్ల—లేరా, పోరా, స్వామి.

అనగా నీవు పోవడము నాకిష్టము లేదు.

నిన్న పొమ్మనుటకు నాకు నోరాడుట లేదు.

ఎట్లు చెప్పగలను.

అయినా—చుట్టుప్రక్కలనున్న ఆ దుర్మార్గులాంద్రు జూతురు గనుక పోయిరా.

నీవు యిక్కడ వుండాలనే నా హృదయం కొట్లాడుతుంది. మనస్సు తపించుతుంది—

అయినా లోకంకొరకు నిన్ను పొమ్మంటున్నాను స్వామి.

ఇచ్చట ఈ భావములు రెండు రకములుగా అభినయించబడును—ఈ నాయిక సామాన్య గనుక.

నిజముగా నాయకుని యెడల ఎడబాయలేని అనురాగము గల్గి హృదయమున తపించుతూ తెల్పుట ఒకటి. కేవలము నటనగా ఈ భావములను అతనికి వ్యక్తముచేయుట రెండవ పద్ధతి. ఈ రెండు పద్ధతులు చెల్లును.

సమర్థులైన కళాకారులు రెండు విధాల అభినయించి, పండితుల ఒప్పించి, మెప్పించగలరు.

సుమారు పదిహేను సంవత్సరాల క్రిందటి విషయం. అప్పుడు నేను వైజాగ్‌లో వుంటున్నాను, సీతమ్మధారవద్ద. శాంతినికేతనము వంటి ఒక సాంస్కృతిక క్షేత్రాన్ని అభివృద్ధిపరచాలనే ఆశయంతో శ్రీ తెన్నేటి విశ్వనాథం మరికొందరు పెద్దలు నన్ను ఆహ్వానించగా వెళ్ళినాను. అచ్చట యెందరికో శాస్త్రీయ నృత్యకళలో శిక్షణిచ్చి యున్నాను. ఆ సమయంలో రాజమండ్రిలో డాక్టరు గరికపాటి రాజారావుగారు కొందరు కళాభిమానులతో కలిసి సాంస్కృతిక సభలు ఏర్పాటు చేశారు. అందు యెందరో కళాకారులు, పండితులు, కవులు, విద్వాంసులు, విద్యావేత్తలు, గాయకులు, నరకులు, నాట్యాచార్యులు పాల్గొన్నారు. ఆ కాలంలో శాస్త్రీయనృత్యకళపై ఊరూరా, వాడవాడా తిరిగి ఉపన్యాసాలిచ్చి, విద్యార్థులను తయారుచేసి ప్రచారం చేయుచున్నవాడిని నేనొక్కడినే అగుటచే ఆ సభలకు ప్రత్యేకంగా నన్ను ఆహ్వానించారు. ఆ సభలకు బరంపురం నుండి డాక్టరు కోరా సత్యనారాయణగారు వారి చిరంజీవులచే నృత్యప్రదర్శనం యిప్పించుటకు వచ్చారు శ్రీ సత్యనారాయణ పూండి జమీందారు వరదా నారాయణరావుగారి అల్లుడు. వరదా నారాయణరావుగారు కళాభిమాని-విశేషించి నృత్యకళంటే అత్యంత ఆసక్తి కల్గినవారు. సభలు ముగిసి తిరిగి వెళ్లేటప్పుడు బరంపురం ఒకసారివచ్చి తెనుగు సంప్రదాయ నర్తనముగూర్చి ప్రచా

రం చేయవలెనని సత్యన్నారాయణరావుగారు కోరారు. కొద్ది రోజుల తరువాత నేను బరంపురం వెళ్లాను. అక్కడ వున్న సమయంలో అనేక సభల్లో పాల్గొన్నాను. ఒక్కొక్కరోజు మూడు సభలు గూడా ఏర్పాటు చేశారు.

"ఇందెందు వచ్చితివిరా"-ఈ పదాన్ని నేను వరుసగా అన్ని సభలందుపాడి అభినయించాను, పట్టినభావము పట్టకుండా. శ్రీ సత్యన్నారాయణరావుగారు ఆ సభలన్నింటికీ వచ్చారు. ఒకరోజు నాతో ఇలా అన్నారు.

"రామకృష్ణగారూ మీ విద్య చాలా అపురూపమైనది. ఇంతటి భావపరంపర ప్రదర్శించగల్గినవారు, అభినయ విద్యను ఇంత లోతుగా తరచి చూచినవారు, శాస్త్ర సంప్రదాయాలను సమన్వయపరచి, వ్యాఖ్యానిస్తూ అభినయించగల్గినవారు యువతరం కళాకారుల్లో మీ వంటివారున్నారంటే చాలా ఆనందంగా వుంది. స్వచ్ఛమైన అభినయ విద్య ఏనాడో అరుదై పోయింది. అభినయానికి, నృత్యానికి తేడా తెలియనివారు నాట్యాచార్యులై పోయారు. ఇక వారివద్ద తర్ఫీదయ్యే శిష్యుల విషయం చెప్పనవసరంలేదు. ఇది మన దేశం యొక్క దురదృష్టం. ఇట్టి సమయంలో మిమ్మల్ని కలిసికొనుట, మీ విద్య తిలకించుట మాలాంటివారికి గర్వకారణంగా వుంది" నేనేదో వారితో చెప్పబోతున్నాను-మధ్యలోనే వారు మరల ఇలా అన్నారు:

"అభినయ కళనుగూర్చి నాకెట్లు ఇంత వివరముగా తెలియునని మీరనుకోవచ్చును. మా నాన్నగారికి భరతవిద్య అంటే ఎంతో అభిలాష. మా అన్నగారి వివాహ సందర్భంలో దక్షిణాది అంతటి నుంచి ఎందరో భరతనాట్య కళావేత్తలను ఆహ్వానించారు. పెండ్లి అయిదురోజుల్లూ వారందరూ కేళిక చేశారు. అందరిలో ఒక కళా

కారిణి విద్యమట్టుకు మా నాన్నగారికి నచ్చింది. ఆమెను కొంత కాలము మా సంస్థానంలో వుండి ప్రదర్శనములివ్వవలెనని కోరినారు.

"ఆమె మూడు నెలలు మా సంస్థానంలో వున్నారు. ప్రతి దినము సాయంత్రం మూడు గంటలకాలం ఆమె అభినయం ప్రదర్శించేది. ఆ సభకు ఎందరో విద్వాంసులు, పండితులు వచ్చేవారు. భరతవిద్యపై చర్చలు జరిగేవి. ఆ ప్రదర్శనలు చర్చలకు నేను హాజరయ్యాను. అందువల్ల అభినయ విద్యయొక్క విశిష్టతగూర్చి తెలిసికోగల్గినాను. ఆమెపేరు చాటపర్రు బాలాత్రిపురసుందరి. ఏలూరు పట్టణ నివాసి. పేరుకు తగినట్టు ఆమె బహుసుందరమైన మూర్తి.

"అభినయ విద్యకు తగిన విశాలనేత్రాలు, చక్కని పలువరుస, తీర్చిదిద్దిన ముఖము. ఆమె ఎన్నో పదాలు, జావళీలు అభినయించారు. దశాబ్దాలు గడిచిపోయినా, నేటికీ ఆ విద్య కన్నులకు కట్టినట్లుంటుంది. తలంచుకుంటే నిన్న, నేడో ఆ కేళికలు జరిగినట్లనిపిస్తుంది. మరల అంతటి విశిష్టతతోకూడిన విద్య నేడు మీలో చూచాను కానీ ఒక్కటే విచారించవలసిన విషయము. ఆనాటి కళాపోషకులు, కళాభిమానులు నేడు అరుదయ్యారు. మీకు తెలిసిన ఈ విద్యనంతనూ గ్రంథస్థము చేయండి. భావితరాల కళాకారులకు ఉపయోగపడుతుంది."

బరంపురం నుండి పూండి వచ్చాము.

పూండిలో సుందరిగారు ప్రదర్శనములిచ్చిన వారి దర్బారు హాలులో ప్రదర్శనమిచ్చాను.

అటునుండి సముద్రతీరాన వున్న గోపాలపట్నం అనే ఊరు వెళ్లాను. అచ్చట గోపాలుని ఆలయం వుంది. సంధ్యావేళ పూజ ముగిసిన పిదప ఆ స్వామి యెదుట కేళిక జేసినాను. ఎచ్చటకు వెళ్లినా

"ఇందెందు వచ్చితివిరా?" మాత్రం వదలక అభినయించాను. గోపాలపట్నంచిన్నపల్లె. కొద్దిమందిమిమాత్రం ఆలయంలో సమావేశ మయ్యాము.

కానీ ఆకేళిక అదొక రసలోక విహారము-

అట్టి దివ్యానుభూతి అరుదుగా లభిస్తుంది. కళలు తెలిసి, అర్థ మెరిగి, విలువ గుర్తించి, కేళికను తిలకించేవారు సభలో ఒక్కరున్నా చాలును. కళాకారుని హృదయసుమము సంపూర్ణంగా వికసిస్తుంది. అప్పుడే పరిపూర్ణమైన విద్యను కళాకారుడు ప్రదర్శించగల్గుతాడు. ఈ సత్యం ఆ రోజు— ప్రత్యక్షంగా అనుభవించాను. గంట, రెండు గంటలు, మూడు గంటల సమయం గడిచిపోయింది.

"ఇందెందు వచ్చితివిరా"

పల్లవి, అనుపల్లవి ముగియలేదు-

ఈ విధంగా జరిగినదా కేళిక-

పూండినుండి వైజాగ్ వచ్చి మరునాడు ఏలూరు వెళ్లాను. శ్రీ మోతేనారాయణరావుగారి ద్వారా ప్రయత్నించి చాటపర్రు నుండి శ్రీమతి సుందరి ఫొటో తెప్పించిచూచాను. ఆమె నిజంగా అభినయానికి బ్రహ్మదేవుడు రూపొందించిన కళామూర్తియే.

ఏలూరులో ఆమె అభినయం జూచిన వృద్ధులు ఎందరో వున్నారు. అందరితో కలిసి మాట్లాడాను. అభినయకళగూర్చి, ఆనాటి అభినయ ప్రదర్శనలతీరును గురించి ఎన్నో విషయాలు తెల్పారు. ఆ కాలంలో నేటివలే ముఖానికి మేకప్పు తళతళ మెరిసే గిల్టు నగలు లేవు. నర్తకి సహజమైన అలంకారములతో సభలో కూర్చొని అభినయం ప్రదర్శించేది. అభినయించు పాత్ర ప్రేక్షకులకు చాలా దగ్గరలో వుండుటవల్ల 'ముఖరాగము' కూడా ప్రేక్షకులు

చూచే అవకాశముండేది. ముఖ్యంగా సాత్విక భావాలను విశేషించి వారు ప్రదర్శించేవారు.

అభినయమనగా నేమి?

అభి-యనెడు ఉపసర్గ పూర్వమందున్న ణిఞ్-ధాతు వునకు చెప్పుట అని అర్థము-పదముల అర్థము ప్రజలకు అభిముఖమగునట్లు పెంపొందించి తెల్పేది అభినయము. విభావానుభావముల సహాయంతో ఒక భావమును గాని, అనుభవమునుగాని ప్రేక్షకులకు తెల్పుట అభినయము.

'రస'మనగా—మనస్సుచే ఎరుగదగిన విశేషము. భావజ్ఞులచే ఆస్వాదింపబడునట్టిది. రసిక హృదయుల ద్రవింపజేయునట్టిది.

సాత్వికములు మనస్సునందుబుట్టి, మనయందు కలుగు మార్పులు.

ఏలూరులో శ్రీమతి సుందరి సమకాలికురాలు చూడామణి గారిని జూచాను. ఆమె వయస్సు డెబ్భై దాటి వుంటాయి. నృత్య సంగీతాలు ఏనాడో విరమించి విశ్రాంతి తీసుకుంటున్న నట్టువరాలు. ఆమెతో అభినయకళగూర్చి మాట్లాడినప్పుడు ఆమెను "ఇందెందు వచ్చితివిరా" అభినయించి చూపవలెనని కోరగా ఆమె వారి పద్ధతిలో అభినయించారు. ఆ అభినయం చూస్తుంటే అలంకార శాస్త్రము చదువుతున్నట్లు 'రసమంజరిలోని' వివిధ నాయికలు ఒక్కొక్కరే రూపొంది మనముందు కదిలాడుతున్నట్లు అనిపించింది.

వైజాగ్‌లో శ్రీ పింగళి లక్ష్మీకాంతకవిగారిని ఒకసారి కలిసి నప్పుడు వారు ఒక పదము అభినయించమని కోరినారు.

"ఇందెందు వచ్చితివిరా" అభినయించాను. వివిధ సంచారు లను వారు కోరి కోరి అభినయింపజేశారు. సుమారు ఒక గంట సమయము 'పల్లవి'కి అభినయంపట్టాను. వారు చాలా సంతోషించి 'కొన్ని సంవత్సరాలక్రిందట మహావిద్వాంసురాలు చాటపర్రు సుందరి అభినయం చూచాను. మరల యీనాడు అట్టి కళ నీలో చూచాను. చాలా కష్టపడి సాధించావు. రామకృష్ణా-ఈ కళ అందరికీ అర్థం గాదు. అభినయం చూచే ప్రేక్షకుడు నర్తించే పాత్రకంటె ఎక్కువ జ్ఞానియై వుంటేగాని ఆ కళయొక్క విశిష్టత గ్రహించలేడు. చిన్న వాడవు మంచి భవిష్యత్ వుంది' అన్నారు.

శ్రీమతి సుందరి అభినయకళగూర్చి తెల్పమని కోరాను.

సుందరి గొప్ప విద్వాంసురాలు. ఆమె ప్రదర్శనం ఒకసారి చూచాను. తోట్లవల్లూరు రాజాగారింట వివాహానికి మేమంతా ఆహ్వానింపబడ్డాము. కాటూరి, నేనూ వెళ్లాము. వివాహానికి వచ్చిన వారందరికీ ఎన్నో వినోదాలు ఏర్పాటు చేశారు. కవి పండితుల కోర్కెపై మాకొరకు వేణుగోపాలస్వామి ఆలయంలో సుందరి అభినయం ఏర్పాటు జరిగింది.

విఘ్నేశ్వర ప్రార్థన ముగించి ఆమె కేళిక

"తాళు తాళుర సామి తత్తరపడనేల" ఈ జావళితో ప్రారం భించినది.

అమరకము, పుష్పబాణవిలాసం, శృంగార మంజరిలో నుండి శ్లోకాలనేమైనా అభినయించునేమో అని అనుకున్న మాకు దాసు

శ్రీరాములుగారి ఆ జావళితో అభినయం ప్రారంభించగానే కొంత నిరాశ కల్గింది. కానీ ఆమె అభినయించినవిధం పాండితీ ప్రతిభ వర్ణించ లేము. రాత్రి పదిగంటలకు మొదలైన కేళిక తెల్లవారుఝామున నాలుగంటలకు ముగింపు జేసింది. అంత సమయం ఆ ఒక్క జావళియే అభినయించింది. మేమందరమూ మంత్రముగ్ధులమై అట్లే చూస్తూ వుండిపోయాము. అట్టిది ఆమె పాండిత్యము అని తెల్పినారు.

నా కళాన్వేషణలో మరొక ప్రముఖ అభినయకళావేత్త గూర్చి తెలిసికొన్నాను. రామచంద్రపురంలో శ్రీమతి చింతా వీరభద్రం అనే నట్టువరాలు వుండేవారు. ఆమె అభినయము, కర్నాటకము, గొల్లకలాపము ఆటలో ప్రసిద్ధురాలు కోనసీమలో పెద్దలయింట వివాహాల సందర్భంలో ఆమెను కేళికకు పిలిపించేవారు. ఆకాలంలో ధనికులయింట వివాహాలు ఐదురోజులు జరిగేవి. ఆ ఐదు రోజులు ఆమె మేళము ఏర్పాటు జరిగేది. సదస్యంనాడు విద్వాంసుల గోష్ఠి, పండితసభ అందు ఆమె గొల్లకలాపము ప్రదర్శన వుండేది. ప్రతి దినము జరిగే 'మేజువాణి'లో ఆమె అభినయం ప్రదర్శించే వారు. ఆఖరిరోజున పెండ్లి కుమార్తెను మగపెళ్ళివారికి అప్పగింతలు పెట్టుచుండగ ఆమె శహానరాగం, త్రిపుట తాళంలో

"అత్తావారింటి అంపేరు మాహారు
అయ్యయ్యో నేనేమిసేతురా"

అనే పదము ప్రత్యేకంగా పాడుతూ, చూచేవారి హృదయాలు కరిగేలాగున అభినయించేదట.

ఆ కొత్త పెండ్లికూతురు మాట అటుంచి, ఆమె అభినయం జూచిన ప్రతిఒక్కరూ కంటతడిబెట్టేవారట.

అంత సహజంగా వుండేది ఆ భావప్రకటన.

భరతకళా ప్రపూర్ణ

# శ్రీ నటరాజ రామకృష్ణగారి రచనలు

1. నృత్యాంజలి
2. నృత్యరేఖ
3. నృత్యమంజరి
4. నృత్యజ్యోతి
5. నర్తనబాల
6. నర్తనశోభ
7. నర్తనసీమ
8. నర్తనభూమి
9. నర్తనమురళి
10. నర్తనపూజ
11. నర్తనకథ
12. నర్తనవాణి
13. నాట్యరాణి
14 నాట్యజ్యోతి
15 నాట్యసుందరి
16. ఆంధ్రుల నాట్యకళ
17 దేవనర్తకి-ఆలయ నృత్యాలు
18. క్షేత్రయ్యపదములు-అభినయము
19. దాక్షిణాత్యుల నాట్యకళా చరిత్ర
20 మన నృత్యకళ
21 రదనిక
22 లకుమ
23. పసిడి మువ్వలు-పేరిణి
24 ఆంధ్రులు
25. నర్తనరీతులు
26. డ్యాన్సింగ్ బెల్సు (ఇంగ్లీషు)
27. తూ. గో. జిల్లాలో నృత్యకళ
28 ప. గో. జిల్లాలో నృత్యకళ
29. తెనుగునాడు-నృత్యకళ

భారత ప్రభుత్వ ప్రథమ బహుమతుల నందుకొన్నవి :

1. నర్తనబాల
2. డ్యాన్సింగ్ బెల్సు (ఇంగ్లీషు)
3. నర్తనసీమ
4 నర్తనభూమి
5 దాక్షిణాత్యుల నాట్యకళా చరిత్ర
6. నర్తనకథ

అచ్చు కానున్న గ్రంథం

**ఆంధ్రులు—నాట్యకళ**

18 సంవత్సరముల పరిశోధన గ్రంథము-5 భాగములు. 2500 పేజీలు-1500 ఛాయాచిత్రములు, రేఖాచిత్రములు, త్రివర్ణ చిత్రములతో-ఆంధ్రులు నృత్యకళా చరిత్రను తెల్పే అపూర్వగ్రంథము.

వివరాలకు : **నటరాజ రామకృష్ణ**

నృత్యనికేతనం-హైదరాబాదు 500020.